Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

మజిలీ

పంపినవారు:
ఏ. చిదానందం - రాజమండ్రి

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

అలెగ్జాండరు చక్రవర్తి ఒకప్పుడు గ్రీకుదేశాన్ని పరిపాలించాడు. అతనికే 'సికందర్' అని మరి ఒక పేరు. సికందర్‌కు గల రాజ్యకాంక్ష మితిలేనిది. అతడు మన దేశంమీదికీ దండెత్తి వచ్చాడు. రాజ్యకాంక్ష ఉన్నా, సికందర్‌లో మంచి లక్షణాలు ఎన్నో ఉండేవి. తప్పు తెలిసినప్పుడు తను పశ్చాత్తాపపడి, సరిదిద్దుకొనేటందుకు ప్రయత్నించేవాడు. సికందరు ఎన్నో దేశాలు జయించి తన దేశం రాగా, అందరూ అతనిని చూడవచ్చారు. 'డియోజినిస్' అనే మహాజ్ఞాని మాత్రం రాలేదు. అందుచేత సికందరే స్వయంగా ఆయనవద్దకు పోయి, ఏమి కావాలో కోరుకొమ్మన్నాడు. సికందర్ గర్వాన్ని డియొజినీసు ఎంత సూటిగా, సూక్ష్మంగా పరిహారం చేశాడో ఈ సంచికలోని 'సన్యాసి: సామ్రాట్టు' అనే గేయం నిరూపిస్తుంది.

సంపుటి 14 : జూన్ 1954 : సంచిక 6

SANKAR

# సన్యాసి : సామ్రాట్టు

జగవిజేత 'సికంద'రాతడు
బీరమారగ మెండుగా
పోరు గెల్చెను పురము జొచ్చెను
తెరువు పౌరులు నిండగా

చూడబోయిరి చక్రవర్తిని
యూరివారలు పెక్కురు
కవులు పండితకోటి వర్గము
శిల్పకారులు భిక్కులు.

గారవించెను వారి నాతడు
పలికె సంతస మాడగా







"పర్వదినమిది గర్వమందితి
మిమ్ములందర జూడగా
ఎన్నజాలని మిన్నగా మరి
లోకమంతయు ప్రాకిన
జ్ఞానవంతుడు డియొజినీసిట
కానడెచ్చట వెదకిన
చూడగోరితి నేడు తప్పక
డియొజినీసుని వెంటనె
జాడ చెప్పుడు వేగ నడుపుడు
చూత మాతని యింటనే."

అంత కొందరు ముందు సాగిరి
దారి తీయుచు వెరగున
కూడ నడిచె సికందరప్పుడు
ఒప్పు మీరగ సరగున.






వేదం వేంకటరామన్

జ్ఞాని యాతని జూచి మెల్లన
నోరు మెదిపెను కోరగా.

"చలిని బాపెడి వెలుగువేడిని
ఇవ్వగలవా వదరక
నాదు కోరిక ఇదియె తొలగుము
ఎండ కడ్డము నిలువక."

వ్రేలవేసెను వదన మంతట
తిరిగి నడచె సికందరు
డియొజినీసుని గడుసుదనమును
ఎంచి మెచ్చిరి యందరు.

కడలియొడ్డున వేడి సూర్యుని
వెలుగునన్ చలి గాచుచు
హాయినుండెను డియొజినీసట
జలధితరగల జూచుచు
వచ్చెనచ్చటి కిచ్చకంబున
చక్రవర్తి సికందరు
డియొజినీసుని దాపు జేరెను
చుట్టు ముట్టిరి యందరు.
"జగవిజేతను చక్రవర్తిని
వీరుడను నే వచ్చితిన్
కోరుకొను మే వరమునైనను
ఇచ్చిపోయెద మెచ్చితిన్"
అని సికందరు ముందు నిలిచెను
డాబు దర్పము మిరగా






# అపాత్ర దానం

మగధరాజు కాలంలో ఒకప్పుడు, బోధిసత్వుడు కోశాధికారిగా ఉంటూవచ్చాడు. అయన ఎనభైకోట్ల వరహాలకు అధిపతి.

కాశీరాజ్యంలో శ్రీవత్స అనే మరిఒక ధనవంతుడున్నాడు. అతనివద్దా ఎనభైకోట్ల వరహాలకు పైగా వున్నాయి. అందుచేత అయనకూడా కోటీశ్వరుడని పేరుపొందాడు. శ్రీవత్సకూ బోధిసత్వుడికీ ప్రాణస్నేహం.

ఎంతటివాళ్ళకైనా కాలం ఒక్కలా జరగదుకదా! దశ మారిపోవటంచేత కోటీశ్వరుడైన శ్రీవత్సకు ఐశ్వర్యమంతా తొలగిపోయింది. చివరకు ఒకేఒక ఆశ అతనికి మిగిలింది—ప్రాణమిత్రుడైన బోధిసత్వుణ్ణి చూచివద్దామని. ఈ ఉద్దేశంతో తనూ, భార్యా పాదచారులై బోధిసత్వుడి దగ్గరకు వెళ్లారు.

బోధిసత్వుడు గబగబ ఎదురు వచ్చి, స్నేహితుణ్ణి కౌగలించుకొని, కుశలప్రశ్నలు వేశాడు. "బోధిసత్వా!–నాకు దశ మారింది. బికారినైపోయాను. ఇటువంటి స్థితిలో నాకు సహాయపడగలవాడివి నీవు ఒక్కడవే అని నమ్మి, ఇలా వచ్చాను. ఇంతకంటె ఎక్కువ చెప్పలేను" అన్నాడు శ్రీవత్స.

"దానికేముంది, చేయవలసిన పనే చేశావు శ్రీవత్సా!" అంటూ బోధిసత్వుడు ఖజానా తీసి నలభై కోట్ల వరహాలు స్నేహితునికి ఇచ్చాడు. అంతేకాదు. తన ఆస్తిని పరివారంతోసహా రెండుభాగాలు చేసి ఒక భాగం శ్రీవత్సకు చెందజేశాడు.

మరి కొంత కాలానికల్లా, బోధిసత్వుడికే ఇటువంటి అవస్థ పట్టి, దారిద్ర్యం పీడించసాగింది. ఇప్పుడు తనను కాపాడగలవాడు ఒక్క శ్రీవత్స తప్ప మరెవ్వరూ లేరని నమ్మి, అతను భార్యతోసహా కాశీరాజ్యానికి బయలుదేరాడు. ఎలానో కష్టపడి అక్కడికి చేరుకొన్నాడు. ఐతే, కాశీరాజ్యానికి చేరుకొన్న



తరువాత, అతడు భార్యను ఊరి పొలిమేరనే చెట్టునీడని నిలిపి, 'నీ విక్కడే ఉండు. నేను శ్రీవత్సతో మాటాడి, నీకోసం బండీ, పరిచారకులనూ పంపిస్తాను,' అని చెప్పి నగరంలోపలకు వెళ్ళాడు.

అనుకొన్నట్టుగానే శ్రీవత్స ఉండే భవన ద్వారంవద్ద నించుని, ఫలానా కోటీశ్వరుడు వచ్చినట్టుగా స్నేహితుడికి వర్తమానం పంపించాడు.

'సరే, లోపలికి రమ్మను...' అన్నాడు శ్రీవత్స. కాని, బోధిసత్వునికి మర్యాద చేయలేదు. 'ఏమిటి పని?' అని ఒకే ఒక ప్రశ్న వేశాడు.

'మీ దర్శనంకోసం...' అన్నాడు బోధిసత్వుడు.

'బస ఎక్కడ?' అని అడిగాడు శ్రీవత్స.

'ఎక్కడా లేదు. నా భార్యని పొలిమేర దగ్గర వదిలి, ఇలా వచ్చాను మీ దర్శనం కోసం' అని బదులు చెప్పాడు బోధిసత్వుడు.

'ఇక్కడ బస దొరకదు. చారెడు గింజలు ఇస్తాం. పట్టుకపోయి, కాచుకు తాగు' అన్నాడు, కఠినంగా శ్రీవత్స.

వెంటనే ఒక సేవకుడు కాసిని గింజలు తెచ్చి బోధిసత్వుడికి ఒడిలో పోశాడు. గింజలు చెంగున మూటకట్టుకొని, తన భార్యని నిలబెట్టివచ్చిన చోటు చేరుకొన్నాడు బోధిసత్వుడు.

'ఏమిటి తెచ్చారు?' అని అడిగింది భార్య.

'మిత్రుడు శ్రీవత్స, పిడికెడు గింజలు వేసి మన పీడ వదుల్చుకొన్నాడు' అని చెప్పాడు బోధిసత్వుడు.

'ఎందుకు పుచ్చుకొన్నారండీ? మన మిచ్చిన నలభైకోట్ల వరహాలకూ ఇది ప్రతిఫలమా?' అన్నదామె.

ఏడుస్తున్న భార్యను ఓదార్చాడు బోధిసత్వుడు. "ఏది ఎలావున్నప్పటికీ, స్నేహం చెడకూడదు. అందుకోసమే ఈ గింజలు పుచ్చుకొన్నాను" అన్నాడు బోధిసత్వుడు.



అంతలోనే—ఒక సేవకుడు ఆ దారిని వచ్చాడు. ఈ సేవకుడు, బోధిసత్వుడు లోగడ శ్రీవత్సకు పంచి ఇచ్చిన పరివారంలో ఒకడు. తన పూర్వపు యజమానినీ భార్యనూ ఆనవాలు పట్టి, వారి కాళ్లపైన పడ్డాడు. 'ఏమిటి బాబూ, ఇలా దయ చేశారు?' అని ఆత్రంతో అడిగాడు. బోధి సత్వుడు సంగతి అంతా చెప్పాడు.

'భయపడకండి బాబూ!— ఈ పాటి దానికేనా?' అంటూ వాడు, వారిని తన ఇంటికి తీసుకపోయి, రాజోపచారాలు జరిపించాడు. అంతేకాదు. వాడు పోయి, 'మన బాబుగారు వచ్చారురా?' అంటూ తోడి సేవకులందరికీ తెలియపరిచాడు.

ఈ సంగతి విన్న కాశీరాజు బోధిసత్వుడినీ, భార్యనూ కబురుపంపి పిలిపించి, 'నీవు నలభైకోట్ల వరహాలు శ్రీవత్సకు ఇచ్చావన్న వార్త నిజమేనా?' అని ప్రశ్నించాడు. జరిగినదంతా దాచక వెల్లడించాడు బోధిసత్వుడు. అప్పుడు కాశీరాజు శ్రీవత్సను పిలిపించి 'అవునా కాదా?' అని కోపంగా ప్రశ్నించాడు.

'అవును' అన్నాడు శ్రీవత్స.

'మరి, నువు పొందిన ఉపకారానికి బదులుగా నీ స్నేహితుని ఏవిధంగా ఆదరించావు?' అని మళ్ళీ అడిగాడు.

ఊరకొన్నాడు శ్రీవత్స.

అప్పుడు రాజు, తన మంత్రులతో ఆలోచించి, శ్రీవత్స ఆస్తి అంతా బోధిసత్వుడికి వప్పగింతపెట్టవలసినదిగా తీర్పు ఇచ్చాడు.

అందుకు బోధిసత్వుడు 'ప్రభూ!— ఇతరుల సొత్తు నాకు పూచికపుల్లకూడా వద్దు. నాది నాకిస్తే అంతేచాలు' అన్నాడు.

ఈ మాటపైన రాజు—బోధిసత్వుని కోరికప్రకారమే తీర్పు సవరించి చెప్పాడు.

తరువాత బోధిసత్వుడు మళ్ళీ తన ఐశ్వర్యం తను పొంది, దాన ధర్మాలతో ధర్మమార్గాన కాలక్షేపం చేస్తూవచ్చాడు.






# పులిమంత్రం

పూర్వం ఒక ఊరిలో సోమశర్మ అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి, మనిషిని పులిగా మార్చే మంత్రం నేర్చుకోవాలని కుతూహలంగా వుండేది. ఐతే, నేర్పే వాళ్ళు ఎక్కడా కన్పించలేదు.

ఒకరోజున, అదృష్టం పండి, పక్కవూరి మఠంలోకి ఒక సన్యాసివచ్చి మకాం చేశాడనీ, అతడు గొప్ప మంత్రవేత్త అనీ తెలిసింది సోమశర్మకు. అతనూ భార్యా మఠానికి పోయి, సన్యాసిని భిక్షకు పిలిచి, అనేక విధాల గౌరవించారు.

భోజనం ఐనతరువాత సన్యాసి భుక్తాయాసం తీర్చుకొంటూ సంతోషంగా కూర్చొన్న సమయాన, సోమశర్మ అయనను ఆశ్రయించి, అ మాటా ఈ మాటా చెబుతూ, తన కోరిక తెలిపాడు.

'పులిమంత్రం ప్రమాదకరం. అందుకనే మేము దానిని లోకానికి వెల్లడించము' అన్నాడు సన్యాసి. శర్మ ఆ సన్యాసిని వదలలేదు. సన్యాసికి కాదనటానికి మనస్కరించలేదు.

చివరకు సన్యాసి ఇలా అన్నాడు: 'ఓయీ శర్మా!—సరే, నీకు పులిమంత్రం నేర్పుతాను. ఐతే, అది కేవలమూ వినోదం కోసమే పనికివస్తుంది. ఎవరినైనాసరే, వారు కోరితేగాని నీవు పులిగా మార్చలేవు,' అని చెప్పాడు.

తరువాత—

శర్మకు రహస్యంగా రెండు మంత్రాలు నేర్పాడు. రెండు రకాల అక్షింతలు చేతికి ఇచ్చాడు: 'శర్మా!—మొదటి మంత్రం పఠించి, ఈ ఎర్ర అక్షింతలు చల్లితే, ఏ మనిషయినా పులిగా మారిపోతాడు. ఆ పులి మొహంమీదమాత్రం, నువ్వు మార్చినట్టు ఆనవాలుగా ఒక మచ్చ స్పష్టంగా కనిపిస్తూ వుంటుంది. నీకు సరదా తీరగానే రెండవ

పత్తి శ్రీనివాసరావు



మంత్రం పఠించి, పసుపు అక్షింతలు పులి మొహంమీది అ మచ్చపైన పడేటట్టు చల్లితే, అది మళ్లీ మామూలు మనిషిగా మారి పోతుంది. ఐతే, ఒక్క ముఖ్యవిషయం జ్ఞాపకంపెట్టుకో—నీ మంత్రంవల్ల మనిషి పులిగా మారిపోయినప్పుడు, దానికి మనుష్య జ్ఞానం ఉండదు. కనుక, నువు జాగర్తగా వుండాలి' అని చెప్పి, సన్యాసి తనదారిని తను వెళ్ళిపోయాడు.

సన్యాసి వెళ్ళిపోగానే, శర్మ భార్యతో ఈ సంగతి అంతా చెప్పాడు. అతని భార్య ఇంతకుముందెన్నడూ పులిని చూచియెరుగదు. అందుచేత, పులిని చూపించమని



కూర్చుంది. అదీగాక శర్మకు కూడా, మంత్రం పనిచేస్తుందో లేదో చూడాలని ఆత్రంగా వున్నది.

అప్పుడు అతను భార్యతో 'చూడూ, పులిగా మారుస్తానంటే ఏ మనిషీ వప్పుకోడు. వాళ్ళ ఇష్టం లేందే నేను వాళ్లను మార్చలేను. అందుకని నీకు ఆ మంత్రాలు నేర్పుతాను. నన్ను పులిగా మార్చు. నువు చూడటం పూర్తిఅయి, నీ సరదా తీరగానే మళ్ళీ నన్ను మనిషిగా మార్చేదువుగాని' అంటూ, భార్యకు మంత్రాలు రెండూ నేర్పి, ప్రయోగించే విధానం చెప్పి, అక్షింతలు చేతికిచ్చాడు.

తీరా, పులిగా మారినతరువాత తను భార్యకు ఎలాంటి హాని కలిగిస్తానో నని ఆలోచించి, ఆమెను ఒక అటకపైకి ఎక్కించాడు. తరువాత గది తలుపులన్నీ మూసివేసి, తను అటకకిందకు వచ్చి తయారుగా కూర్చొన్నాడు.

అతని భార్య కుతూహలంకొద్దీ మంత్రం పఠించి, అక్షింతలు చల్లి, భర్తను పులిగా మార్చింది. శర్మ పులిగా మారటంతోనే, భయంకరంగా గర్జిస్తూ, బయటికిపోయే మార్గంలేక గది తలుపులు బద్దలుకొట్ట నారంభించాడు.







పులిగా మారిన శర్మనుచూచి వాని భార్య హడిలిపోయింది. ఆ భయంలో ఆమె రెండవ మంత్రం కాస్తా మరిచి చక్కాపోయింది. తన చేతిలో అక్షింతలు రెండు మూడు సారులు పులి మొహాన చల్లింది. కాని, ఏమీ లాభంలేకపోయింది.

కొంతసేపటికి ఎలా అయితేనేం, పులి తలుపులు బద్దలుగొట్టి ఊరిపక్కన అడవి లోకి పారిపోయింది. పులి పారిపోయిన తరువాత శర్మభార్యకు కొంచెం మనస్సు స్తిమితపడి, రెండవ మంత్రం జ్ఞాపకం వచ్చింది. కాని, ఏం లాభం!

తన తెలివితక్కువ పనికి ఆమె చాలా విచారించి, భర్తను గురించి బెంగపెట్టు కొన్నది. రెండునెలలకు ఆమె తమ్ముడు అక్కడికి వచ్చాడు. వానిని వెంటబెట్టుకొని, ఆమె ధైర్యంచేసి, తన భర్తకోసం అడవిలో వెదకసాగింది.

ఇలా ఉండగా—

ఆ రాజ్యంలో కొత్తగా ఒక మచ్చపులి వచ్చి పల్లెలమీద పడుతున్నదని రాజుగారితో ప్రజవచ్చి మొరపెట్టుకొన్నారు. అప్పుడు రాజుగారు వాళ్ళకు 'మీకు వచ్చిన భయం లే'దని చెప్పి పులిని చంపటానికని, పరివారంతోసహా అడవికి బయలుదేరారు. ఎంత వెతకినా ఆ మచ్చపులి కనబడక పోవటంతో, విసిగి వేసారి రాజుగారు ఒక చెట్టునీడలో విశ్రాంతి తీసుకోబోయారు.

అంతలోనే ఆయనకు వెనుకనుంచి ఒక గర్జన వినబడింది. చూడగా, అలా గర్జించింది మచ్చపులే! అది పంజా ఎత్తి రాజుగారి మీదికి దూకింది. దానితో పైప్రాణాలు పైకి ఎగిరిపోయినై రాజుకు.

కాని, ఆయన ఆశ్చర్యపడేటట్టుగా, చూస్తూవుండగానే ఆ పులి బ్రాహ్మడుగా మారిపోయాడు. అతడే సోమశర్మ! ఒక చేయి ఎత్తి పట్టుకొని, రెండవచేతితో రాజు గారి గొంతు నొక్కి పట్టుకొనివున్నాడు.



శర్మకు పులిగా మారిపోయిన క్షణంనించీ తను ఏమేంచేశాడో తెలియదు. అకస్మాత్తుగా అడవిలో అతనికి మానవస్వరూపం వచ్చే సరికి, తను ఈ అడవికి అసలు ఎందుకు వచ్చాడో, రాజుగారి గొంతు ఎందుకు నొక్కి పట్టివున్నాడో అర్థంకాలేదు.

శర్మ వణికిపోతూ రాజుగారి కాళ్లమీద పడి, క్షమించమని ప్రార్థించాడు. ఆశ్చర్యంలో మునిగిపోయారు రాజుగారు. ఆయనకు ఇదేమీ అర్థంకాలేదు.

ఆ సమయంలో, పక్కన వున్న చెట్టు మీదనుంచి ఒక స్త్రీ దిగివచ్చింది. ఆమె వనదేవత కాబోలు అనుకొన్నాడు రాజు.

పైగా, పులినుండి తనను రక్షించినది ఆ దేవతే అని అనుకొని, వెంటనే ఆమెకు నమస్కరించాడు.

ఆమె వనదేవత కాదు, సోమశర్మ భార్యే. రాజుగారు తెల్లబోయి చూస్తూ వున్నాడు. ఆమె రాజుకు తన కథ అంతా చెప్పింది. పులిగామారిన భర్తకోసం అడవిలో తిరుగుతూవుంటే మచ్చపులి అక్కడకు రావటం సంభవించింది. వెంటనే ఆమె గుర్తుపట్టి చెట్టుఎక్కి కూర్చున్నది. రాజు గారిపైన ఆ పులి పంజా ఎత్తగానే ఆమె అక్షింతలు చల్లి తన భర్తకు తిరుగా మామూలు స్వరూపం వచ్చేటట్లు చేసింది.

తనకు ప్రాణదానం చేసిన ఆమెను మెచ్చుకొని రాజుగారు సోమశర్మకు తన ఆస్థానంలో గొప్ప ఉద్యోగం ఇచ్చారు. అప్పటినుంచీ ఆ భార్యాభర్తలు సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు.

వాళ్ల ఇద్దరికీ పులిమంత్రం సరదా తీర డమే కాకుండా, నాటినుంచీ వాళ్ళ వంశానికి 'మచ్చపులి వంశం' అని సార్థకమైన పేరు వాడుకలోకి వచ్చింది.

కొంతకాలానికల్లా సోమశర్మకు మంత్రం నేర్పిన సన్యాసి మళ్ళీ రావటం తటస్థిం చింది. శర్మ సంగతి విని సంతోషించాడు.






పూర్వకాలమందు కాశ్మీర్ రాజ్యంలో ఒక శిల్పి ఉండేవాడు. అతడు వట్టి సోమరి పోతు. ఏ పనీ గడువులోపల చేయడమనేది అతడు ఎరుగనే ఎరుగడు.

ఆనాడు కాశ్మీర్ రాజ్యాన్ని ఏలే రాజు చాలా బుద్ధికుశలత కలవాడు. ఎంత పెద్ద నేరం చేసినవాళ్ళకైనా శిక్ష విధించేవాడు కాదు. నొప్పించకుండా, నవ్వుతూ మాటాడుతూనే బుద్ధిచెప్పి, వాళ్ళ తప్పు వాళ్ళు తెలుసుకొనేటట్టు చేసేవాడు.

ఆ ప్రభువు ఒకప్పుడు యీ శిల్పిని పిలిపించి, నదీతీరాన ఒక దివ్య భవనమూ, ఉద్యానవనం నిర్మించమని ఆజ్ఞాపించాడు. కొన్ని సంవత్సరాలు గడువుకూడా పెట్టాడు.

రాజాజ్ఞప్రకారం శిల్పి వెంటనే పని ప్రారంభిస్తానన్నాడు. కాని, సంవత్సరం గడచినా భవనానికి ఒక ఆకారమంటూ ఏర్పడలేదు. అదేవిధంగా, ఏపనీ పూర్తి కాకుండా రెండో ఏడుకూడా గడచిపోయింది. మూడోయేడూ, నాలుగో ఏడుకూడా అలానే వ్యర్థంగా గడచిపోయినై.

నాలుగేళ్ళతరువాత ఒకరోజున రాజు, తన భవనమూ, ఉద్యానవనం ఎంతవరకు తయారైనవో చూదామని వెళ్ళాడు. చూస్తే ఏముంది? పనీలేదు, పాటూ లేదు. శిల్పి ఒక పెద్ద చలవరాతిపైన కూర్చొని, పని వాళ్ళతో కథలూ కబుర్లూ ఊసులూ చెప్పుకుంటూ, నవ్వుతాలాడుతున్నాడు! ఇదంతా చూచాడు రాజు. కాని, కొంచెమైనా శిల్పిని కోపపడలేదు. మందలించనైనా లేదు.

రాజును చూస్తూనే శిల్పి లేచి నిలబడి దండంపెట్టి, 'ప్రభూ!—మీ రాకవలన ఈ ప్రదేశమంతా పావనమయింది. ఈ స్థలంలోనే భవనం కట్టాలని నిశ్చయించాను. ఇక్కడ నేను నిర్మించబోయే ఆ దివ్య భవనాన్నిచూచి దేశదేశాల రాజులు, చక్ర

కె. ఎస్. ఎస్. రావు




వర్తులు, ఫాదుషాలూ 'అయ్యో, మాకు ఇటువంటి భవనం లేకపోయెకదా!' అని అసూయ పడతారు. భవనం చూచిన యాత్రికులు వాళ్ల దేశాలకు పోయి, అక్కడ దీని అందచందాలను గురించి వేయివిధాల పొగడుతారు. కవులు తన్మయులైపోయి, పద్యాలు కడతారు' అన్నాడు.

ఈ మాటలకు రాజు మనస్సులో నవ్వుకొని, 'ఓయీ శిల్పీ!—నీ తెలివితేటలకు నేను సంతోషించాను. ఒక చిన్న కథ చెబుతా విను: అనగనగా ఒక రైతు. వాడు సోమరి. దున్నవలసిన కాలంలో భూమి దున్నక, చల్లవలసిన ఋతువులో విత్తనాలు చల్లక, 'చూడండి, నా భూమి ఎంత సారవంతమైనదో!' అని పొగడుకొంటూ కూర్చొనేవాడట. తీరా చూస్తే ఏముంది? భూమినిండా కలుపూ, చెత్తా కనబడేది. చెమటోడ్చి కాయకష్టం చేస్తే భూమి పండుతుందిగాని, మాటలతో అవుతుందా, చెప్పు? ఐతే, నువు అలాటివాడివి కావులే, నీ పనిచూచి మెచ్చుకొని, బహుమతి ఇద్దామని వచ్చాను. ఏదీ, నువు నిర్మించిన దివ్య భవనం చూపించు...!' అంటూ, ముందుకు అడుగులు వేయసాగాడు.

రాజు తనను నిజంగానే పొగడుతున్నాడని మురిసిపోయాడు శిల్పి. పూర్తికాని మంటపాలు, కొంచెంగా చెక్కి విడిచిన స్తంభాలు, పైకప్పు లేని గదులు—ఇటువంటి వన్నీ రాజుకు చూపిస్తూ, ఇంకా పెద్ద కబుర్లు చెప్ప నారంభించాడు శిల్పి.

శిల్పి చెప్పిన ఈ కబుర్లు వినగానే, అతని సంగతి పూర్తిగా అర్థమైపోయింది రాజుకు. 'ఆహా!—నువు ఎంత గొప్ప శిల్పివి! ఎంత త్వరలో భవనం నిర్మించివేశావు. ఎంత అందంగా వుంది! చూడటానికి రెండు కన్నులూ చాలవే?' అని స్తోత్రం చేశాడు రాజు. నిజమే అనుకుని ఉబ్బిపోయాడు శిల్పి.

కొంత దూరం నడిచివెళ్ళాక, రాజు అతనితో 'శిల్పీ!—నీవు నాముందు నడుస్తూ, మన భవనంయొక్క చిత్ర విచిత్రాలన్నీ వరసగా చూపించాలి!' అన్నాడు.

రాజాజ్ఞ ప్రకారం శిల్పి ముందు నడుస్తున్నాడు. కొంతదూరం వెళ్ళి తటాలున ఆగాడు. 'ఇక్కడ లోతైన కందకం ఉన్నది ప్రభూ. మనం మరొక దారిన పోవాలి' అన్నాడు శిల్పి.

అందుకు రాజు 'అబ్బే. అలాంటిదేమీ లేదు. అదంతా చదునుగా కనిపిస్తూవుంది నాకు. ఎదట ఒక పెద్ద భవనంకూడా కనబడుతూ వుంది. ముందుకు నడు...' అని ఆజ్ఞాపించాడు. అక్కడ ఇంకా భవనం పూర్తిగా కట్టలేదనీ, అది లోతైన కందకం అనీ మళ్ళీ విన్నవించాడు శిల్పి. 'లేదు. నాకు, తీర్చి దిద్దిన చక్కని కాలిబాట కనబడుతూవుంది. నడు, ముందుకు...' అని మళ్లీ గద్దించాడు రాజు. రాజభటులు శిల్పికి ఈటెల మొనలు చూపించి అతని పైన కళ్ళెర్రచేశారు.

చావుకు భయపడి, శిల్పి గబగబ ముందుకు నడిచాడు. నీళ్ళతో నిండివున్న కందకంలో పడ్డాడు. అతనికి ఈత రాదు. కొంతసేపు పెనగులాడిన తరువాత, భటులు వానిని ఒడ్డుకు లాగి రక్షించారు.






అప్పుడు రాజు శిల్పిని చూచి, 'ఎంత సదుపాయమైన స్నానవాటిక నిర్మించావయ్యా శిల్పీ! ఎంత శ్రమపడ్డావో ఇది కట్టడానికి! నీ నిపుణతకు మెచ్చాము' అని మళ్ళీ స్తుతించాడు.

తరువాత రాజు, శిల్పిని వెంటబెట్టుకొని మండపం చూడబోయాడు. అదీ అసంపూర్తిగానే వుంది. 'ఎంచక్కటి మండపం! శిల్పి అనే పేరు నీకే తగింది. ఆహా, ఆ చిలుకబొమ్మలు, ఆ నెమలి నృత్యాలు, ఆ పూవులూ, ఆ లతలూ, తీర్చి దిద్దినట్టున్నయ్యే! ఆ సింహాసనం ధగధగలాడుతూ ఎలా మెరుస్తూ వుందో! ఇరుపక్కల ఉండే ఆ సింహాలు జీవకళ ఉట్టిపడేటట్టు ఎట్లా చెక్కావయ్యా శిల్పీ!—ఏదీ, ఒకసారి నువు ఆ మండపంలోని సింహాసనంమీద కూర్చొని నన్ను ఆనందపరుచు' అన్నాడు.

ఇందుకు శిల్పి, 'మహారాజా!—ఇంకా మండపం తయారుకాలేదు. ఇప్పుడు అక్కడ సింహాసనంకూడా లేదు. ఏముంది, మళ్లీ ఈ వారంనాటికల్లా తయారుచేసివేస్తా' అని బదులుచెప్పాడు.

"ఓస్, అదేమిటి, మెరుస్తున్న సింహాసనం నాకు కనబడుతూవుంటే...అబద్ధం ఆడతావేం? కూర్చో. ఊఁ—పోయి దానిమీద కూర్చోవేం!' అని గద్దించాడు రాజు.

శిల్పి రాజుకు భయపడి, సింహాసనం అమర్చవలసిన చోటికి వెళ్ళాడు. అక్కడ గోడకు అనుకొని, కుర్చీలో కూర్చున్నట్టే కూర్చొన్నాడు. శిల్పి స్థితి గోడకుర్చీ వేసినట్టుగా వుంది.

అప్పుడు రాజు 'శిల్పీ!—నిన్ను ఆ సింహాసనంపై కూర్చోబెట్టి గౌరవించాను. ఈ గౌరవాన్ని నీవు చప్పున మరచిపోకుండా వుండేందుకు ఇవాళ మధ్యాహ్నంవరకూ ఇటు అటు కదలకుండా కూర్చోవాలి. తెలిసిందా?" అన్నాడు.

ఒకవేళ శిల్పి అలా కూర్చోకపోయినట్ట యితే శిక్షించటానికి ఇరవైమంది రాజభటులు ఈటెలు పట్టుకొని సిద్ధంగా ఉండనే ఉన్నారు.

'ఫలానా శిల్పి కొత్త భవనంలో రాజ సింహాసనంపైన కూర్చున్నాడట!' అనేవార్త నగరమంతా వ్యాపించింది. ఎక్కడెక్కడి ప్రజలూ ఉద్యోగులూ తండోపతండాలుగా శిల్పిని చూడవచ్చారు. ఎటువంటి ఆధారమూ లేకుండా, కుర్చీలో కూర్చొన్నట్టుగా శిల్పి కూర్చోవటం చూచి అందరూ వింతపడి పొట్టలు చెక్కలయేటట్టు నవ్వుకొనసాగారు.

ఆ సమయంలో రాజు మళ్లీ అక్కడికి వచ్చి, 'శిల్పీ!—నిన్ను చూచి నేనే కాదు, రాజ్యంలోని ప్రజలందరూ మెచ్చుకొన్నారు. ఈ సింహాసనం, నాకు కాదు, నీకే బాగా తగివుంటుందని అందరూ అనుకొంటున్నారు!' అన్నాడు.

అటుతరువాత, శిల్పిని వెంటబెట్టుకుని ఉద్యానవనం చూడబోయాడు రాజు. ఇదివరకులాగానే ముందు శిల్పి, వెనుక రాజూ నడుస్తున్నారు. ఆ ప్రదేశమంతా ముళ్ళ పొదలతో నిండివుంది. అది చూచి రాజు ఎంతమాత్రం సహించలేకపోయాడు.




'శిల్పీ! మన ఉద్యానవనం ఎంత సొంపుగా ఉన్నదోయ్! చక్కగా నిర్మించావు. పూలవాసన గుమాయిస్తూవుంది. ఆ తటాకంకూడా కలువలతో, మంచి నిర్మల జలంతో కలకల్లాడుతూ వుంది. ఇలా కనుపండువుచేసే ఉద్యానవనం నే నెక్కడా చూడనేలేదు! ఏవీ, కాసిని పూవులు కోసి పట్టుకురా, చూదాం!' అన్నాడు.

అడవిపువ్వులకు వాసనేమిటి! అయినా రాజాజ్ఞను ధిక్కరించలేక, శిల్పి అక్కడికి పోయి, ఆ పువ్వులు కోయసాగాడు. వాటికి ఉండే నూగు తగిలి, చేతులు దురదపెట్ట నారంభించినై.

'నువ్వు కష్టపడి పెంచిన ఈ పువ్వులు చాలా ఆకర్షణీయంగా ఉన్నవిసుమా! ఇక వాటి పరిమళం ఎలా వుందో చూచి చెప్పు' అన్నాడు రాజు. రాజభటులు శిల్పికి ఈటెలు గురిపెట్టే ఉన్నారు. శిల్పి పువ్వులను ముక్కుదగ్గర పెట్టుకొనక తప్పింది కాదు. దానితో ముక్కు దురదపట్టుకొన్నది. 'ఈ చక్కటి పుష్పాలు కొన్ని నీ భార్యకు బహుమతిగా పంపించు శిల్పీ!' అని ఆజ్ఞాపించాడు రాజు.

రాజాజ్ఞకు తిరుగు లేదుకదా! వెంటనే శిల్పి ఒక సేవకుని చేత ఆ పువ్వులను భార్యకు పంపించాడు. శిల్పి ఇంటికి వెళ్లిన ఆ సేవకుడు కొంచెం సేపటిలోనే తిరిగి అక్కడికి వచ్చేశాడు.

'బాబయ్యా! పువ్వులు చేతపట్టుకొని వెళ్ళి ఇస్తే సంతోషించటానికి బదులు నన్నూ భర్తగారినీకూడా అయమ్మ చెడతిట్టి పోసిందండీ' అంటూ ఆ తిట్లన్నీ పూస గుచ్చినట్టు రాజుగారితో చెప్పాడు. అక్కడ వున్న ప్రజలందరూ ఈ సంగతి విని పకపక నవ్వారు.

అప్పుడు శిల్పి రాజు కాళ్లపైన పడి, 'నావల్ల పెద్ద పొరపాటు జరిగింది ప్రభూ!' అని క్షమాపణ కోరుకొన్నాడు. నాలుగేళ్ళు వృధా చేసినందుకు ఎంతగానో విచారించి, తనపని ఆనాడే ప్రారంభించాడు. కొన్ని నెలలలోనే నదీతీరాన రాజు కోరుకొన్న దివ్య భవనం, ఉద్యానవనమూ వెలిసినై.

సోమరితనం పోగానే శిల్పి నేర్పరితనం లోకానికి వెల్లడి అయింది. అప్పుడు రాజు అనేక విధాల శిల్పిని బహూకరించాడు. ప్రజలూ మెచ్చారు. రాజు శిల్పికి చెప్పిన ఈ గుణపాఠం ఒక్క అతనికే గాక, రాజ్యంలోని సోమరిపోతులందరికీ బుద్ధి వచ్చేటట్టు చేసింది.






## 6

[కుండలినీ రాజ్య సైన్యాలు, ధనాగారం నింపేటందుకు పరరాజ్యాలమీదికి దాడి బయలుదేరినై. అశుభసూచకంగా తోకచుక్క కనబడింది. తుఫానులో చిక్కి ఓడలు కొన్ని సముద్రంపాలయినై. కొందరు సైనికులు ఒక ద్వీపం చేరారు. అక్కడ క్రూరమృగాలూ, మాంత్రికులైన వికాక్షి, చతుర్నేత్రులు తారసపడ్డారు. వారినుంచి తప్పుకు పారిపోతూన్న సైనికుల మార్గంలో అగ్నిపర్వతం బద్దలయింది. తరువాత–]

అగ్నిపర్వతంనుండి ఎగసివస్తున్న నిప్పురవ్వలు ఆకాశానికంటా విరజిమ్ముతున్నాయి. ఇది చూచి సమరసేనుడూ, సైనికులూ పొందిన భయానికీ ఆశ్చర్యానికీ మేర లేకపోయింది.

సరీగా వారు పోవలసిన దోవలోనే ఈ అగ్నిపర్వతం బద్దలయింది. కనుక, ఇంకిప్పుడు వేరుదారి చూచుకొని వెనకడుగు వేయటం తప్పనిసరి అయింది. సమరసేనుడు దారితీశాడు. భయకంపితులైన సైనికులు మారుమాటాడకుండా, తమ సేనానిని అనుసరించారు. ఇప్పుడు అందరూ పడమటి దిక్కుకే నడుస్తున్నారు. చూడగా-వాళ్ళ ఓడలు తూర్పు తీరంలో వున్నవాయె. ఐతేమాత్రం? ఒకవంక మాంత్రికులూ, క్రూరమృగాలే కాక ఇప్పుడు ఈ అగ్నిపర్వతం కూడా వారిని ఎదురుకొంటూ వుండగా ఎలా చేరుకోగలరు తూర్పుతీరానికి?

అగ్నిపర్వతం ధాటీకి భూమి ఇంకా అదురుతూనే వుంది. పర్వతంనుంచి వెడలి





వచ్చిన పొగలతో ఆకాశమంతా కమ్ముకుపోయింది. ఇది చాలదన్నట్టుగా గొప్ప భూకంపం కలిగే సూచనలు కూడా కనిపించ సాగినాయి. సమరసేనుడు ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి, 'ఇది మంత్రాల దీవే కాదు; అగ్ని పర్వతాల దీవి! భూకంపాల దీవి...!' అంటూ ఒక విధమైన భయాన్ని వెల్లడించాడు.

చెట్లలోనుంచీ, తుప్పలలోనుంచీ దారి చేసుకొని, సమరసేనుడూ, సైనికులూ ముందుకు నడుస్తున్నారు. ఐతే, అగ్ని పర్వతంనుంచి వెలువడిన 'లావా'ద్రవం పొగలు కక్కుతూ పల్లపు చోటు లన్నిటికీ ప్రవహిస్తున్నది. ఇది చూచి నలుమూలల నుండి వన్యమృగాలు పరుగులెత్తుతూ అరుస్తున్నాయి. ఇవి కంటపడగానే సమరసేనుడికి మరింత హడలుచ్చుకుంది.

సలసల కాగే లావాద్రవంతో దాట శక్యంకాని నది ఏర్పడకముందే ఏదో ఒక గట్టు చేరుకోవటం మేలనుకొన్నాడు. లేకపోతే లావాద్రవంవల్ల కలిగే ఉపద్రవమే కాకుండా, కంగారుతో పరుగులెత్తే క్రూర మృగాల బాధకూడా తప్పించుకోవాలి.

సమరసేనుడు తన సహజధోరణిలో పరివారానికి ధైర్యం చెబుతూ ముందుకు నడుస్తున్నాడు. హఠాత్తుగా అతని దృష్టికి ఒక వింత దృశ్యం గోచరించింది. 'ఇది కలా? నిజమా?' అనే సంశయంలో పడ్డాడు. కాని, మరి నాలుగు అడుగులు వేసేసరికి, తను చూస్తున్నది అక్షరాలా నిజమే అని రూఢి అయిపోయింది.

'జాగర్త' అని సైనికులకు హెచ్చరించాడు సమరసేనుడు. అతను నిశ్చేష్టుడై నిలబడి అదేపనిగా చూస్తున్నాడు. ఎట్టఎదట చెట్టుకొమ్మనుండి ఎవరో ఒక మనిషి తలకిందుగా వేలాడుతున్నాడు! వాడు బతికివున్నాడో చచ్చాడో తెలియదు. కాళ్లూ, చేతులూ తీగెలతో బంధింపబడి వున్నాయి.





వాడి ముఖ లక్షణాలూ, ధరించిన జంతు చర్మాలూ చూస్తే, ఒక అడవిజాతివాడని తెలియవస్తున్నది.

సేనానితోపాటు సైనికులూ నిశ్చేష్టులై ఈ వింత చూస్తూవున్నారు. ఈ మంత్రాల దీవిలో మృగాలూ, మాంత్రికులే కాదు— మానవులుకూడా వుంటున్నారని వాళ్ళకు తెలిసింది. సమరసేనుడు కొంచెం స్థిమిత పడి, నిదానంగా ఆలోచించి, 'ఈ అడవి మనిషికి ఇంత కఠినమయిన శిక్ష విధించిన వారు ఎవరైవుంటారు?—' అని తనని తనే ప్రశ్నించుకొన్నాడు.

"అడవిజాతికి చెందినవాడయితే యేం, వాడూ మానవుడే. ఇటువంటి మానవులు ఈ దీవిలో నివసిస్తున్నట్టు రూఢి ఐంది గనక వీళ్ళ నివాసస్థానం ఎక్కడో కనుక్కోవాలి. కనుక్కొంటే, ముందుముందు మనకు ఎంతో ఉపయోగిస్తుంది," అన్నాడు సమర సేనుడు.

సైనికులు మాటాడలేదు. ఎప్పుడు తూర్పుతీరం పోయి తమ రాజ్యం చేరుకో గలమా అనే ఆత్రంతో వున్న సైనికులకు సేనాని మాటలు రుచించలేదు. 'మనదారి మనం చూచుకోక, ఇంకా ఈ అడవి మనుష్యుల నివాసస్థానాలు పరీక్షించటం







ఆ నిర్భాగ్యుణ్ణి చూస్తూవుంటే అంద రకూ జాలికలిగింది. సమరసేనుడు మాత్రం 'ఇందులో గూఢమైన రహస్యం ఏదో వుండి తీరాలి. ఇది కనిపెట్టడం ఎలా?—ఒకటి మాత్రం నిశ్చయం—ఈ దీవిలో కొంత ప్రదేశం మానవులకు నివాస యోగ్యమై వున్నది. దీనినిబట్టి వీడి మరణానికి కారణం ఏమిటో కనుక్కోవాలి' అని ఈ విధంగా సమరసేనుడికి ఆ రహస్యం తెలుసుకోవాలనే ఆసక్తి ఎక్కువయింది.

దేనికి? లేనిపోని శ్రమ' అని అనిపించింది వారికి. సైనికులు అలా మౌనం వహించే సరికి, సమరసేనుడుఏమీ అనలేకపోయాడు. వారి మనోభావం గ్రహించాడు. ఆ మాటకు వస్తే, వారికేకాదు, తనకూ ఎంతట బయట పడదామా అనే వుంది. కాని, మార్గం ఏదీ?

మరి కొంచెం ముందుకు నడిచాడు సమరసేనుడు. ఆగాడు. తలకిందుగా వేలాడే ఆ మనిషిని పరీక్షించాడు. 'చూడగా వీడి శరీరంమీద గాయాలు ఏమీ కనపడవు. బహుశా విరోధులు ఇలా వేలాడదీసివుంటారు. వీడు ఆకలిదప్పులతో అలమటించి, మరణించి వుంటాడు' అనుకున్నాడు.

అంతలోనే-అల్లంత దూరాన పడివున్న ఒక వస్తువుమీద సమరసేనుడి దృష్టి పడింది. గభీమని అక్కడికి వెళ్ళాడు. ఆ వస్తువు చేతిలోకి తీసుకున్నాడు. అది పగిలి పోయిన ఒక సొరకాయబుర్ర. దాని మూతి సన్నంగా వుంది. ఆ మూతికొక తాడు బిగించివుంది.

అడుగు పగిలిన ఆ సొరకాయబుర్రను ఎవళ్ళో పారవేసి పోయారు. పరీక్షగా చూస్తే, అది ప్రయాణంలో నీళ్ళు మోసుకు పోవటానికి ఉపయోగించిన సాధనంలాగా వుంది.

'ఆహా!-అంతా కుండలినీదేవి కరుణ!-' అన్నాడు సమరసేనుడు. ఆకాశంకేసి చూసి ఒక్కసారి నమస్కరించాడు.






తమ నాయకుడు ఇలా చేయటానికి కారణమేమిటో ఊహించలేకపోయారు సైనికులు. వారి ఆశ్చర్యం గ్రహించిన సమరసేనుడు—

"భయపడకండి. మానవులు నివసించే ప్రదేశానికి మనం దగ్గరలోనే వున్నాం. ఈ నిర్భాగ్యుణ్ణి మనుషులే ఇలా వేలాడదీశారు. పైగా ఈ సారకాయబుర్ర మానవులు ఉపయోగించేదే. కనుక, మనం కాస్త జాగర్తగా వెతికితే, ఆ మనుషులు ఇక్కడికి ఏ దారిని వచ్చారో, ఏ దారిని తిరిగివెళ్ళారో ఆనవాళ్లు తెలియకపోవు" అన్నాడు గంభీరంగా.

మరుక్షణంలో సైనికులు, ఆ ప్రాంతంలో మనుషులు తొక్కిన కాలిబాటలు ఏమైన కనబడతవేమోనని వెతకసాగారు. కొద్దిసేపటికే వాళ్ళ శ్రమ ఫలించింది. ఒక పచ్చిక బయలుమీద కనిపించిన గుర్తులు చూస్తే, ఎంతోమంది మనుషులు గుంపులు గుంపులుగా ఆ బయలుమధ్యనుండి నడిచిపోయినట్టుగా అర్థమయింది.

సైనికులందరూ ఉత్సాహంతో ఆ బాట వెంట నడవసాగారు. ఒక్క అరగంటసేపటిలో వారు ఒకానొక ఎత్తైయిన ప్రదేశం చేరుకొన్నారు. అక్కడ నిలబడి చుట్టూ కలయజూచారు. అగ్నిపర్వతం ఇంకా మంటలు గుప్పిస్తూనే వుంది. ప్రాణభీతితో అడవిజంతువులు పరుగెత్తుతూనే వున్నాయి. వాటి అరుపులు వినిపిస్తున్నాయి. అక్కడక్కడ దూరాన అడవి తగలబడుతూవున్న మంటలుకూడా కనబడుతూనేవున్నాయి.

తిరుగా వారు గమ్యస్థానం తెలియకుండా తలలు వంచుకొని ముందుకు నడవసాగారు. క్రూరమృగాలూ, మాంత్రికులూ తారసపడతారనే భయం వారిని వదలనే లేదు. అందరూ మనస్సులో కుండలినీ దేవిని స్తోత్రం చేస్తూనేవున్నారు. కత్తులూ అంబులూ సిద్ధపరచుకొనికూడా వున్నారు.





కొంతసేపటికి వారు వచ్చి ఒక నదీతీరం చేరుకొన్నారు. ఆ నది ఎత్తుపల్లాలలోనుండి దుముకుతూ ప్రవహిస్తున్నది.

నది మధ్యనంతా బ్రహ్మాండమైన రాళ్ళ మయం. వాటిని చుట్టుకొని కిందకు ధారలు ధారలుగా ప్రవహించే ఆ నది రణగొణధ్వని చేస్తున్నది.

ఈ నది దాటి అవతలకు పోవటమా? మానటమా? అని సంశయం కలిగింది సమరసేనుడికి. చేరుకోవలసిన చోటు ఏదో తెలియనప్పుడు నదికి ఇవతల వుంటే ఏమి, అవతల వుంటే ఏమి?

వారు చేరవలసింది తూర్పుతీరం. కాని అగ్నిపర్వతం బద్దలయిన కారణంగా పడమటి తీరంవేపు వస్తున్నారు. ఇదిమాత్రం నిశ్చయం. అంతలో ఒక సైనికుడు 'సేనానీ!-ఈ నది దాటటం అంత తేలికైన పనికాదు' అన్నాడు.

'ఔనౌను' అని వెంటనే జవాబిచ్చి, సమరసేనుడు మళ్లీ ఆలోచనలో పడ్డాడు. పొడవాటి తాడువంటిది ఏదైనా దొరికితే ఈ నది దాటటం ఏమంత కష్టంకాదు, అనుకొన్నాడు సమరసేనుడు. ఈ ఆలోచన తన సైనికులకు వెల్లడించాడు. ఐతే, ఈ అడవిప్రాంతంలో తాళ్ళు దొరికేది ఎక్కడ?

అందుకని సైనికులు చెట్లవద్దకు పోయి, వాటిని ఆశ్రయించుకొని వుండే కొన్ని తీగెలు తెంపుకొని వచ్చి, వాటితో ఒక బలమైన మోకు తయారుచేశారు. ఆ మోకు కొస ఒకటి నదిఒడ్డున ఉండే ఒక చెట్టుకి కట్టారు. రెండవ కొస పట్టుకొని, ఒక్కొక్కరే దాని ఆసరాతో ఆ ప్రవాహంలోని బండరాళ్ల మీదినుంచి నడవజొచ్చారు.

కాసేపటికల్లా వారు నదికి అవతలి తీరం చేరారు. సమరసేనుడు సైనికులను హెచ్చరించి, ఒక ఎత్తైనదిబ్బ ఎక్కాడు. అవతల దగ్గర్లో అంతగా చెట్లు లేవు. కాని కొంత దూరం నడిచి వెళ్తే-అదంతా చెట్లమయం.



సమరసేనుడు ఆ ఎత్తైన దిబ్బదిగాడు. కాలిబాట గుర్తులు కనిపిస్తున్నై. అందరూ నడిచి చెట్లమధ్యకు చేరారు.

వాళ్ళు చెట్లమధ్యకు రావటమేమిటి, భయంకరమైన ఘీంకారశబ్దాలు వినిపించడమేమిటి—రెండూ ఒక్కసారే జరిగినయి.

భయకంపితులయిన సైనికులు తమ నాయకుడికేసి చూశారు. సమరసేనుడు ఒక్క గంతువేసి చేరువలోవున్న చెట్టుకు ఎగబాకాడు. సైనికులు అతనిని అనుసరించారు. ఒక్క త్రుటిలో ఆ ప్రదేశమంతా కలయదొక్కుకొంటూ ఘీంకరిస్తూ ఒక ఏనుగులమంద వస్తూవున్నది.

అడవిమంటలలో చిక్కుకోకుండా ఏనుగులు పారిపోతున్నాయి. వాటి కాళ్ళ తాకిడికి భూమి ప్రతిధ్వనిస్తున్నది. చిన్న చిన్న మొక్కలూ, పొదలూ, తుప్పలూ చెట్లూ నుగ్గు నుగ్గు ఐపోతున్నాయి. ఆప్రదేశమంతా భీభత్సంగా తయారయింది.

చెట్లకు ఎగబాకిన సమరసేనుడూ, సైనికులూ ఆ ఏనుగుల మందను చూచి హడలిపోయారు. 'క్షణమాత్రం ఆలస్యం ఐతే వాటి కాళ్ళకింద పడి మనంకూడా పిండి ఐపోయేవాళ్ళం కదా! అదృష్టం బాగుండి, చేరువనే చెట్లుండటంచేత బతికి బయటపడ్డాం' అనుకున్నారు.

కాస్సేపటికల్లా ఏనుగులమంద ఆ ప్రదేశం వదిలిపోయింది. ఐనా, చెట్టుమీది నుంచి దిగటానికి వాళ్లకు భయంగానేవుంది.

ఎలా ఐతేనేం, గుండెలు పీచుపీచుమంటున్నప్పటికీ సమరసేనుడూ, సైనికులూ కిందికిదిగారు. ఏపాటిచడిఐనా హడలిపోతూనేవున్నారు. ఈసారి మళ్ళీ ఆ కాలిబాటకోసం వెతికారు. కాని, దాని ఆనవాలే కనబడలేదు. ఏనుగుల పాదాలకింద నలిగిన ఆ ప్రదేశమంతా ఒక్కటిగానే కనబడుతున్నది. ఇప్పుడు ఏంచేయాలి?

—(ఇంకా వుంది)






# బలవంతపు సంగీతం

అక్బరుచక్రవర్తి ఆస్థానంలో ఉండే గాయకుని పేరు 'తాన్‌సేన్'. తాన్‌సేన్ ప్రపంచ ప్రఖ్యాతిపొందిన గొప్ప గాయకుడు. అక్బరు వద్దనే వీరబల్ అనే పరిహాసకుడుకూడా ఉండేవాడు. అతడు చక్రవర్తికి ప్రాణసమానుడు.

ఒకనాడు వీరబల్ చక్రవర్తివద్దకు పోయి, 'ప్రభూ!—దీపకరాగం చాలా గొప్పగా వుంటుందంటారు. అది ఒక్కసారి వినాలనివుంది' అంటూ, తన కుతూహలాన్ని వెల్లడించాడు.

అందుకు చక్రవర్తి 'దానికేముంది? ఇప్పుడే విందువుగాని' అని చెప్పి, వెంటనే తాన్‌సేన్‌ని పిలిపించి, దీపకరాగం పాడమని ఆజ్ఞాపించాడు.

ఆ కాలంలో సంగీతవిద్వాంసులు దీపకరాగాన్ని ఎవరిముందూ పాడేవారుకాదు. కాని, ఏంచేయుటం? ఇష్టమున్నా లేకపోయినా తాన్‌సేన్, ప్రభువు ఆజ్ఞను పాటించే తీరాలి. అందుచేత, మారు ఆలోచన లేకుండా, తాన్‌సేన్ దీపకరాగాన్ని ఆలాపించాడు.

ఆలపించాడేకాని, ఆ సమయాన తాన్‌సేన్‌కి హృదయంలోపల ఒకవిధమైన జ్వాల దహించివేస్తున్నట్టుగా అనిపించింది.

తను చేసిన పొరపాటుకి అతనెంతో విచారించాడు. మనస్సులో తీరని బాధ పట్టుకున్నది. దానితో అతని ఆరోగ్యం పాడైపోయింది. ఈ స్థితిలో తాన్‌సేన్, చక్రవర్తి అనుజ్ఞ పొంది, గుజరాత్ ప్రాంతంలోని శబర్మతి నదీతీరానికి చేరుకొన్నాడు.

ఆ రోజులలో మొగలాయీలకు గుజరాత్ రాష్ట్రం ఆక్రమించుకోవాలని తీవ్రమైన ఆసక్తి వుండేది. వాళ్ళ భయం మూలంగా స్త్రీలు తెల్లవారకముందే నదికి వచ్చి, నీళ్ళు పట్టుకపోయేవాళ్లు.

ఎస్. జె. రావు



53




ఒక గ్రామంలో—ఇద్దరు అక్కాచెల్లెళ్లు రోజూ శబర్మతి నదికి నీళ్లకోసం వచ్చేవారు. అందులో అక్క పేరు 'తానీ', చెల్లెలి పేరు 'నానీ'. ఒకరోజున వారిద్దరూ నదీ తీరాన కూర్చొనివున్న తాన్‌సేన్‌ని చూచారు.

చూచీ చూడటంతో, వారి నోటి వెంబడి అప్రయత్నంగా ఈ మాటలు వెలువడినై: 'ఈయనెవరో దీపకరాగం ఆలాపించి బాధ పడుతున్నట్టుందే!—' అని.

ఈ మాటలు చెవిని పడటంతోనే తాన్‌సేన్‌కు ఆశ్చర్యం కలిగింది. వెంటనే పరుగెత్తుక పోయి, వాళ్ళకు తన కథ అంతా వినిపించాడు. ముందు వాళ్లిద్దరూ అతనిని చూచి భయపడ్డారు. కాని, 'చెల్లీ! చెల్లీ!' అని ఎంతో ఆప్యాయంగా పిలిచి; తన గోడు వెలపోసుకోవటంతో, వారికి తాన్‌సేన్‌పైన నమ్మకం కుదిరింది.

ఆ అక్కా చెల్లెళ్ళు వానిమీద జాలిపడి అతనిని వాళ్ల ఇంటికి తీసుకపోయారు. అతను కొంచెం స్తిమితపడిన తరువాత 'నానీ' మధురస్వరంలో మేఘమల్లార్ రాగం పాడి వినిపించింది. ఒక్కసారి కాదు, అనేకసార్లు ఆమె పాడి వినిపించింది. మేఘమల్లార్ రాగం దీపకరాగానికి విరుగుడు కావటంచేత, కొంతసేపటికల్లా తాన్‌సేన్‌ని దహిస్తూవున్న మనోవ్యాధి నయమయింది.

తాన్‌సేన్ ఆరోగ్యం కుదుటపడగానే, ఆ అక్కా చెల్లెళ్ళు 'ఈ రహస్యం ఎవరికీ చెప్పను' అని ఒట్టు వేయించుకొని, అతనిని సాగనంపారు. తాన్‌సేన్ కొన్నాళ్లకు ఢిల్లీనగరం చేరాడు.

తాన్‌సేన్ ఆరోగ్యం బాగుపడటం చూచి చక్రవర్తి చాలా సంతోషించాడు. ఇలా అతని ఆరోగ్యం కుదుటపడటానికి కారణం ఫలానా అని విద్వాంసులవల్ల తెలుసుకొన్నాడు చక్రవర్తి. అప్పటినుంచీ ఆయనకు మేఘమల్లార్‌రాగం వినాలని గట్టి కుతూహలం పట్టుకొన్నది.






ఇప్పుడు మేఘమల్లార్ ఆలాపించమని చక్రవర్తి తాన్‌సేన్‌కి ఆజ్ఞాపించాడు. తనకు ఆ రాగం రాదని ఎంతచెప్పినా ప్రభువు వినిపించుకోలేదు. చివరకు, తన ప్రాణ రక్షణకోసమని తాన్‌సేన్ ఆ అక్కా చెల్లెళ్ల సంగతి వెల్లడించక తప్పిందికాదు.

చక్రవర్తి బలవంతాన తాన్‌సేన్ అయనను శబర్మతీ నదీతీరానికి తీసుకవెళ్ళాడు. మామూలుప్రకారం తానీ నానీలు నదికి వచ్చారు. వారిద్దరూ తాన్‌సేన్‌నీ అతడి వెంటనున్న చక్రవర్తినీ గుర్తించారు.

చక్రవర్తి వారివద్దకు పరుగెత్తుకుపోయి 'అమ్మాయిలూ, ఒక్కసారి మేఘమల్లార్ పాడి వినిపించరూ?' అని వేడుకొన్నాడు. కాదనలేకపోయారు ఆ అక్కాచెల్లెళ్ళు. సరే, పాడటానికి ఒక సమయం ఏర్పాటు చేశాడు చక్రవర్తి.

ప్రత్యేకంగా అలంకరించబడ్డ ఒక సభలో సరీగా ఆ సమయాన అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ మేఘమల్లార్‌రాగం ఆలాపించారు. చక్రవర్తి తన్మయుడై వారిద్దరికీ, వారి వారి భర్తల పేరట, కోరకుండానే రెండు పెద్ద జాగీరులు వ్రాసి ఇచ్చాడు.

తానీ, నానీలు సంగీతవిద్యలో ప్రవీణులే కాదు, వారిద్దరూ మహా పతివ్రతలు. చక్రవర్తి ఆజ్ఞను మీరలేక వారు నిండు సభలో పాట పాడవలసివచ్చింది. అలా సభలో పాడటం సంసారస్త్రీలకు తగిన పని కాదనీ, అది పాతివ్రత్యానికి భంగకరమనీ వారి నమ్మకం. అందుచేత, సభకు బయలుదేరేముందే వారిద్దరూ తగిన ఏర్పాట్లు చేసుకువచ్చారు.

సభ ముగిసింది. చక్రవర్తి వారిని మెచ్చుకోవటం, బహుమతి యివ్వటం జరిగింది. అప్పుడే ఆ అక్కా చెల్లెళ్ళు, వెంట తెచ్చుకొన్న కత్తులతో ఒకరినొకరు పొడుచుకొని నేలకు ఒరిగారు. ఈ దృశ్యం చూస్తూనే తాన్‌సేన్ మూర్ఛపోయాడు.



తరువాత తానీ, నానీల భర్తలు అక్కడికి వచ్చారు. వారిముందు చక్రవర్తి తల ఎత్తలేకపోయాడు. తను అనాలోచితంగా చేసిన పని రెండు నిండుప్రాణాలను బలి గొన్నదే అని విచారించాడు.

అక్కా చెల్లెళ్ళు ఇద్దరూ సభకు పోయే ముందే వారి భర్తల పేర ఉత్తరాలు వ్రాసి ఉంచారు. ఆ ఉత్తరాలలో ఇలా వుంది:

'మొగల్ చక్రవర్తి ఆజ్ఞను శిరసావహించటానికి నిండుసభలో మేము పాడవలసి వచ్చింది. ఇలా పదిమందిలో పాడటం మా పాతివ్రత్యానికి మచ్చగా మేము భావిస్తున్నాము. అందుచేత, ఈ శరీరాలను అహుతిచెయ్యటమే సరియైన పని అని మాకు తోచింది. స్వర్గలోకంలో మనం కలుసుకొందాం. శెలవు...'

తాన్‌సేన్ వారిని జన్మలో మరచిపోలేకపోయాడు. మేఘమల్లార్ రాగాలాపనచేసి ఆ అక్కాచెల్లెళ్ళు తనను మృత్యువునుంచి కాపాడారు. యిక తన వాగ్దానభంగంవల్ల ఆ యిద్దరూ మృత్యువుపాలయారు. తానీ, నానీల మరణానికి తనే కారణం అని ఎంతగానో దుఃఖించాడు తాన్‌సేన్. వారిద్దరి పేర్లూ చిరస్థాయిగా ఎలా వుంటాయా అని ఆలోచించాడు.

ఇందుకుగాను–సంగీతస్వరాలలో ఎక్కడెక్కడ 'ఓం' అనే అక్షరం వస్తుందో, అక్కడక్కడల్లా 'తోమ్ తానా నానా' అని తన పాటలలో ప్రయోగిస్తూ వచ్చాడు. అదే పద్ధతి ఇప్పటికీ సంగీత శాస్త్రంలో ప్రచారంలో వుంటున్నది. ఈ విధంగా తాన్‌సేన్ ఆ అక్కాచెల్లెళ్ళకు అమరత్వం కలిగించాడు.

అంతేకాక, ఆ అక్కా చెల్లెళ్ళ జ్ఞాపకార్థం వారిని తను ప్రథమంగా చూచిన ప్రదేశంలో ఒక సంగీత మందిరం నిర్మించాడు. అది ఇప్పటికీ అహమదాబాద్ నగరంలో ఆలిస్‌వంతెన పక్కన శిథిలావస్థలో ఉంది.






# పాములూ ముంగిసా

బరంపురంలో భాస్కరయ్య అనే భూస్వామి ఒకడు ఉండేవాడు.

అతగానికి పాములంటే మహా చెడ్డ భయం. నీటిపాము కనబడ్డా త్రాచుపాము అనుకుని హడలిపోయేవాడు.

అతని కొకనాడు పొలంగట్టున నిజంగా త్రాచుపామే కనపడింది. పడగ విప్పి ఆడుతూంటే కృష్ణపాదాలు ఆతనికి స్పష్టంగా కనపడ్డాయి. బుస్, బుస్‌మన్న ధ్వనికూడా వినపడింది. ఆ మరుక్షణంలో ఆ సర్పం తన దారిని పోయిందిగాని, భాస్కరయ్యకు అది తన్నుచూసే బుసకొట్టిందనీ, తనపైన పగబట్టే ఉంటుందనీ, అనిపించింది. ఆ రోజునుంచీ అతగాడు పొలంవైపు వెళ్లటం పూర్తిగా మానేశాడు.

కాని భాస్కరయ్యకు రోజూ రాత్రి కలలో ఆ పాము కనపడేది. అంతకు ముందు, రోజూ పొలంవెళ్లి పాలేళ్లతోబాటు అతనుకూడా పనిచేసేవాడు కనక, రాత్రిళ్లు సుఖంగా నిద్రపట్టేది. ఇప్పుడు భయంతో ఇల్లు వదలకపోవటంవల్ల అతనికి తిన్న తిండి అరగటం మానేసి, నిద్ర సరిగా పట్టక అస్తమానూ కలలు వచ్చేవి. ఆ కలలలో ఎప్పుడూ పాములే కనపడేవి!

ఒక రాత్రి అందరూ గాఢంగా నిద్ర పోతూన్నసమయంలో భాస్కరయ్య మంచం మీదనుంచి క్రింద పడిపోయి, 'బాబోయ్, పాము కరిచేసింది! విషం ఎక్కిపోతోంది! నోటమ్మట నురగలు వచ్చేస్తున్నాయి! చచ్చిపోతున్నాను!' అంటూ అరవటం ప్రారంభించాడు. ఆ కేకలతో ఇంటిల్లిపాదీ కంగారుపడి లేచి, నిజంగా పాము వచ్చి కాటువేసింది కాబోలు అనుకుని టార్చి లైట్లు వేసి వెతకటం మొదలెట్టేరు.

పాముజాడ ఎక్కడా కనపడకపోయే సరికి, భాస్కరయ్య భార్య పార్వతమ్మ,

పాలంకి వెంకటరామచంద్రమూర్తి




'కలగాని వచ్చిందా?' అని అడిగింది'

"ఔను. రెండుతలల పాము! మళ్లీ చూసే సరికి, రెండల్లా పది తలలుగా మారి పోయాయి. 'నేను తక్షకుణ్ణి! నువ్వు పరీక్షిత్తు మహారాజువి! నిన్ను కాటువేసే స్తున్నాను, కాసుకో!' అంటూ మీదపడింది. మళ్ళీ చూసేసరికి పది తలలకు బదులు వెయ్యి తలలు కనపడ్డాయి" అన్నాడు భాస్కరయ్య.

'సరిగా లెక్కపెట్టినట్లే చెపుతున్నారే!' అని హేళన చేసింది పార్వతమ్మ.

'నేను ఓమూల హడిలి చస్తుంటే నీకు వేళాకోళంగా ఉందా?' అంటూ భాస్కరయ్య ఆమెను గట్టిగా కసిరి కోప్పడ్డాడు.

'కాసిన్ని మంచినీళ్ళుత్రాగి కృష్ణ నామ స్మరణ చేసుకుని నిద్రపొండి. ఇంక ఆ పీడ కల మళ్ళీ రాదు' అని సలహా చెప్పి, పార్వతమ్మ నిద్రపోయింది. భాస్కరయ్యకు మాత్రం ఇంక ఆ రాత్రి నిద్రపట్టనేలేదు.

ఇలాగ రోజూ నిద్రపట్టకపోతే ఆరోగ్యం చెడిపోతుందని భయంవేసి పార్వతమ్మ భర్తతో, 'పరంజ్యోతిగారివద్దకు ఒకసారి వెళ్ళి మందు పుచ్చుకోండి' అని పంపింది.

బరంపురంలో పరంజ్యోతి చాలా గొప్ప డాక్టరన్న పేరు సంపాదించాడు. ఆయన ఇంగ్లీషు వైద్యం, హొమ్యోపతి వైద్యం, యునాని, ఆయుర్వేదం మొదలైన వైద్యాలన్నీ చేయగలడు. ఆయనకు మంత్ర శాస్త్రం, భూతవైద్యంకూడా తెలుసు.

ఆయన భాస్కరయ్య చెప్పుకున్నదంతా విని, 'రేపు సాయంకాలం మళ్ళీ ఒకసారి రండి. అప్పటికి మందులు సిద్ధంచేసి ఉంచుతాను' అన్నాడు.

ఆ తయారైన మందు ఏదో తెచ్చుకుందామని భాస్కరయ్య మరునాడు పరంజ్యోతి గారింటికి వెళ్లాడు. ఆయన మూరెడు పొడుగూ జానెడు వెడల్పూ, అంతే ఎత్తూ ఉన్న ఒక అట్టపెట్టెను భాస్కరయ్య



ముందు పెట్టాడు. పెట్టె మూత ఊడి రాకుండా ట్వైనుదారం ముడివేసి ఉంది. విప్పడానికి వీలులేకుండా ఆ ముడిపైన లక్క సీలు వేశాడు.

'ఏమిటి బాబూ ఇది?' అని అడిగాడు భాస్కరయ్య.

'పెట్టెను పట్టుకు చూడు, నీకే తెలుస్తుంది' అన్నారు డాక్టరుగారు.

భాస్కరయ్య పెట్టెను ఎత్తి ఎత్తడంతో దానిలో ఒక వైపునుంచి రెండో వైపునకు ఏదో పరుగెత్తినట్లు అలికిడయింది.

భాస్కరయ్య ఉలిక్కిపడి, 'దీనిలో ఏదో కదులుతూంది!' అన్నాడు.

'ఏదో కాదోయ్, ముంగిస! ఈ పెట్టెను తీసుకుపోయి ఈ రాత్రినుంచీ మంచం క్రింద పెట్టుకుని నిద్రపో. ఇంక నీకు పాముల పీడ ఉండదు....పెట్టెనుమాత్రం తెరవకూడదు. తెరిస్తివా, ముంగిస పారిపోయి, మళ్లీ పాములు వస్తాయి' అన్నాడు పరంజ్యోతిగారు.

'తెరవకూడదనే తాడుకట్టి లక్కముద్ర వేశారన్నమాట. ఎందుకు తెరుస్తానులెండి...ఔనుగాని ఒక్క సందేహం పీడిస్తున్నది. పెట్టెను తెరవకపోతే ముంగిసకు ఆహారం పెట్టటం ఎలాగ?' అన్నాడు




భాస్కరయ్య. తెలివైన ఈ ప్రశ్నకు 'ఆ యేర్పాటులన్నీ నేను దానికి పెట్టెలోనే చేసివుంచాను' అనిచెప్పి పరంజ్యోతిగారు భాస్కరయ్యను పంపేశారు.

ఆ ముంగిస ధర్మమా అంటూ భాస్కరయ్యకు ఆ రాత్రి బాగా నిద్రపట్టింది. నాటి రాత్రికూడా కల వచ్చి కలలో నాగుపాములు వచ్చాయి. కాని వెంటనే పెట్టెలోంచి ముంగిస ఎలా బయటపడిందో కాని ప్రత్యక్షమై ఒక్కొక్క నాగునే పట్టుకు చీరేసి, తినేసింది!

కలలో వచ్చే సర్పాలన్నీ రోజురోజూ ఈవిధంగా ఆ ముంగిసవల్ల సంహరింప



బడటంచేత కాబోలు, ఒకనాటి రాత్రి స్వప్నంలో భాస్కరయ్యకు ఒక్క పాము కూడా కనబడలేదు.

భాస్కరయ్య ధాన్యం అమ్మినబాపతు సొమ్ములోనించి ఒక వందరూపాయల కాగితం తీసుకుని, ముంగిస పెట్టెను చంకన పెట్టుకుని పరంజ్యోతిగారి దర్శనానికి వెళ్ళేడు.

అతడు నమస్కారపూర్వకంగా అర్పించుకున్న ఆ నోటును డాక్టరుగారు మడిచి జేబులో పెట్టుకుంటూ, 'నీకిప్పుడు బాగా నిద్రపడుతోందా? కలలో పాములేమీ బాధించటంలేదుకదా?' అని అడిగారు.

'లేదండీ' అన్నాడు భాస్కరయ్య కృతజ్ఞత కనబరుస్తూ.

'ఈ పెట్టెనుకూడా తెచ్చావెందుకు?' అన్నారు డాక్టరుగారు.

'పెట్టెలో ఈ ముంగిస నా నిమిత్తం ఇన్నిరోజులూ చెర అనుభవిస్తూంది పాపం. తమతో చెప్పి దీనిని చెర విడిపిద్దామని తెచ్చాను' అన్నాడు భాస్కరయ్య.

'నువ్వే ఆ పుణ్యం కట్టుకో' అన్నారు పరంజ్యోతిగారు.

భాస్కరయ్య భక్తితో లక్కసీలు తీసి వేసి తాడును తెంపబోయాడు. దాని

మూలాన పెట్టె కదిలి, లోపల అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ గబగబా కదులు తూవున్న చప్పుడయింది.

"'ఎప్పుడు బయటపడదామా!' అన్న తొందరలో ముంగిస పెట్టెలోపల ఉర కలు వేస్తూందండి!" అంటూ భాస్కరయ్య పెట్టె మూతను తీసి, ముంగిస మీదపడు తుందన్న బెదురుచేత కాబోలు కొంచెం దూరంగా వెళ్ళి నిలబడాడు.

ముంగిస కాదుకదా పెట్టెలోనించి ఒక్క చిమ్మెటకూడా పైకి రాలేదు.

'ఏమైంది బాబూ ముంగిస?' అన్నాడు అదుర్దాగా భాస్కరయ్య.

భాస్కరయ్య మెల్లిగా చప్పుడు చెయ్య కుండా పెట్టెవద్దకు వచ్చి తొంగిచూశాడు. పెట్టెలో ఒకమూల వెలక్కాయంత రబ్బరు బంతి ఒకటి కనపడింది.

భాస్కరయ్య ఆశ్చర్యంతో, 'ఐతే డాక్టరు గారూ, పెట్టెలో అటునుంచి ఇటూ, ఇటు నుంచి అటూ, ముంగిస పరుగులెడుతోందను కున్నాను. ఇప్పటివరకూ ఇటూ అటూ దొర్లుతూ చప్పుడుచేసింది ఈ బంతేనా?' అన్నాడు.

'ఔను' అన్నారు చిరునవ్వు నవ్వుతో పరంజ్యోతిగారు.

'అంతా మాయ అన్నమాట!' అన్నాడు భాస్కరయ్య నివ్వెరపోతూ.

'కలలలో కనపడే పాముల్ని చంప టానికి ఈ కల్లముంగిసను నేనే కల్పిం చాను మరి. అలాటి పాములను చంప టానికి మామూలుగా ఉపయోగించే కర్రలూ అవీ పనికిరావు. అందుకోసమే, శక్తివంత మైన ఈ గమ్మత్తు ముంగిసను సృష్టించ వలసివచ్చింది' అని చెప్పారు పకపక నవ్వుతూ పరంజ్యోతిగారు.

నాటినించి భాస్కరయ్యకు పాములను గురించిన భయమూ భ్రాంతీ వదలిపోయినై. రాత్రిళ్ళు హాయిగా నిద్రపోయేవాడు.






# వాయసరాజు

అనేకవేల సంవత్సరాల కిందట అవంతీ దేశాన్ని అనూపుడు అనే రాజు పాలిస్తూండే వాడు. ఆయన ఆస్థానంలో ఒక గొప్ప దైవజ్ఞుడు ఉండేవాడు.

ఆ దైవజ్ఞుడు రోజూ సూర్యోదయాదివేళ నదికి స్నానం చేసేటందుకు వెళ్ళేవాడు. ఆయన ఒకనాడు స్నానంచేసి శుచిగా ఇంటికి తిరిగివస్తున్నాడు. వచ్చే దారిలో ఒక మామిడితోట వున్నది. దైవజ్ఞుడు ఆ మామిడిచెట్లకిందినుంచి నడిచి వస్తూండగా, చెట్టుకొమ్మలపైన వున్న ఒక కాకి సరీగ్గా అతడిమీద పడేటట్టు రెట్టవేసింది.

ఆయన మండిపడ్డాడు. తనను ఈ విధంగా మైలపరచిన కాకినే కాక, మొత్తం వాయసజాతినే నాశనం చేసివేస్తానని గట్టి ప్రతిజ్ఞ పట్టాడు.

ప్రతిజ్ఞ నెరవేరేటందుకు పరిస్థితులు కలిసివచ్చినై. ఎలా అంటే: రాజుగారి కోట పక్కన ఒక పూరిగుడిసె వున్నది. ఆ గుడిసెలో ఒక ముసలివాడుండేవాడు. ఆ రోజున వాడు వరిధాన్యం ఎండలో పోసి కావిలి కూర్చున్నాడు. మిట్టమధ్యాన్నంవేళ. ఎండ మండిపోతోంది. కాపలా కూర్చున్న ముసలి వాడు కునికిపాట్లు పడసాగాడు.

ఆ పక్కనే మేస్తున్న ఒక గాడిద, ముసలివాడు అలా ఆదమరిచివున్నప్పుడల్లా ధాన్యంమీద పడి బొక్కుతూవచ్చింది. రెండు మూడుసార్లు గాడిదను అదిలించి చూశాడు. కాని అది అక్కడినుంచి పోలేదు.

ఇక యిది పనికాదనుకొని ముసలివాడు గాడిదను పట్టుకున్నాడు. ఇంత నూనె పోసి

పి. ఆనందయ్య



ఒక తాటాకు తడిపాడు. గాడిదతోకకు ఆ ఆకు కట్టి నిప్పు ముట్టించాడు. భగ్గుమని మంటలు లేవగానే గాడిద పరుగెత్తసాగింది. ఒళ్లూపై తెలియని గాభరాలో అది రాజుగారి ఏనుగులశాలలో చొరబడింది. దానితో ఏనుగులశాల నిప్పంటుకొన్నది.

మంటలో చిక్కుకొన్న ఏనుగులు ఘీంకరిస్తూ అటూ యిటూ పరుగెత్తసాగినై. ప్రజలు భయకంపితులయ్యారు. హాహాకారాలు చెలరేగినై. మావటివాళ్లు శ్రమపడి ఎట్లాఅయితేనేం వాటిని పట్టి గొలుసులతో గట్టిగా కట్టవేశారు.




ఇలా జరగటంతో రాజుగారికి చాలా కలవరంకలిగింది. గాయపడిన ఏనుగులకు గజవైద్యులు చేతనైన చికిత్సలన్నీ చేశారు. అనేకమైన ఓషధులు తెచ్చి, తైలాలు రాయించి, మర్దనాలు చేయించి చూశారు. గుణం యివ్వలేదు.

కొన్నాళ్లతరువాత రాజుగారు యాదాలాపంగా ఈ సంగతి దైవజ్ఞుడితో అన్నారు. ఇటువంటి అవకాశం ఎప్పుడు చిక్కుతుందా అని కనిపెట్టుకొనివున్న దైవజ్ఞుడు భలే సంతోషం పొందాడు.

"ప్రభూ! ఆ ఏనుగుల గాయాలు మానాలంటే—కాకికొవ్వు తెప్పించి రాయిస్తే సరిపోతుంది. ఘనవైద్యులమని కబుర్లుచెప్పే ఆ గజవైద్యులకు యీమాత్రం ఎందుకు తెలియలేదో నాకు ఆశ్చర్యంగా వుంది!" అన్నాడు.

రాజుగారికి ఈ చికిత్సాపద్ధతి బాగున్నట్టే తోచింది, పైగా ఖర్చులేనిది. ఎక్కడ కనబడిన కాకిని అక్కడనే పట్టి చంపి, రాజనగరుకు తేవలసిందని రాజుగారు దండోరా వేయించారు. ఇంకేం, రాజ్యంలో ప్రతివాడు వేటగాడయి పోయాడు. వందల, వేల సంఖ్యలో కాకులను చంపి తేసాగారు.

రాజు సాగిస్తూవున్న ఈ దురంతం ఆనాడు కాకులకు నాయకుడుగా వున్న



వాయసరాజుకు చాలావిచారం కలిగించింది. రాజును కలుసుకోవాలని అనుకున్నాడు.

వాయసరాజు ఎగిరివెళ్లి రాజప్రాసాదం చేరుకొన్నాడు. ఆ సమయంలో కలకల్లాడుతూ నిండుదర్బారు జరుగుతూవుంది. వాయసరాజు సూటిగా ఎగిరివెళ్ళి రాజుగారి సింహాసనం పక్కన వాలాడు. అది చూసిన సేవకులు 'ఇదేమిటి, కాకి వచ్చి వాలిందేమిటి?' అంటూ పట్టుకోవటానికి ప్రయత్నించారు. కాని దాని నేమీ చేయవద్దని చెప్పి రాజు వాళ్లని వారించాడు.

అప్పుడు వాయసరాజు మానవభాషలో రాజుతో యిలా అన్నాడు:

"రాజా, తమరు కోపగించక నా పలుకులు ఆలకించాలి. రాజైనవాడు ఇతరుల సలహాలను ఆచరణలో పెట్టేముందు మంచి చెడ్డలు ఆలోచించి చూడాలి. అలా చేయకపోతే ఎంతోమందికి దుఃఖ కారణం అవుతుంది. మీ దైవజ్ఞుడు, కాకికొవ్వు ఏనుగుల గాయాలను మాన్పగలదని చెప్పాడు. నిజానికి, కాకి శరీరంలో కొవ్వు ఉండనే వుండదు. ఇది దుష్టబుద్ధితో ఇచ్చిన సలహా కాని, మరొకటి కాదు!"

ఈమాటలువిని రాజు ఆశ్చర్యపోయాడు. 'కాకి శరీరంలో కొవ్వు ఉండకపోవటానికి కారణం ఏమిటి?' అని వాయసరాజును ప్రశ్నించాడు. అందుకు వాయసరాజు—

"మానవలోకమే దానికి శత్రువు. కాగా, మరణభయంతో ఎల్లప్పుడూ మగ్గిపోయే కాకికి కొవ్వు ఎలా పట్టుతుంది ప్రభూ?" అని ఎదురుప్రశ్న వేశాడు.

దీనితో రాజుకు సత్యం తెలిసిపోయింది. కాకులను చంపరాదని శాసించాడు. దుష్టబుద్ధితో తనచేత పాపకార్యం చేయించిన దైవజ్ఞుణ్ణి ఆ పదవినుంచి తొలగించివేశాడు. ఆనాటినుండీ రోజుకు రెండుపుట్ల ధాన్యం కాకులకు ఆహారంగా చల్లవలసిందని ధాన్యాగారాధిపతికి ఉత్తరువు జారీచేశాడు.





# జయాపజయాలు

పూర్వం విదర్భదేశాన్ని విజయపాలుడనే రాజు పాలించాడు. ఆయన శౌర్యపరాక్రమాలను గురించి దేశదేశాలవారు కట్టు కథలుగా చెప్పుకొనేవారు; పాటలు కట్టి పాడుకొనేవారు. కారణమేమంటే ఆయన ఎన్నడూ రణరంగంలో అపజయం ఎరగడు. చుట్టుపక్కల దేశాలలో ఆయనతో యుద్ధం చేసి ఓడిపోని రాజు లేడు.

విజయపాలుడికి కుమారులు లేరు, జలజాదేవి అనే ఒక కుమార్తె మాత్రం ఉండి. ఆమెకు యుక్తవయసు వచ్చింది. కాని, తనవంటి పరాక్రమవంతుడి కుమార్తెను పెళ్లాడదగిన పరాక్రమశాలి ఎక్కడా లేడనే అనుమానంతో విజయపాలుడామెకు వివాహప్రయత్నం చేయలేదు. జలజను పెళ్ళాడాలన్న అభిలాష చాలామంది రాజకుమారులకు ఉన్నా విజయపాలుడిమీద కత్తిగట్టి యుద్ధంలో ఓడిపోవటంకన్న ఊరుకోవటమే మంచిదనుకున్నారు. అయితే జయపురం యువరాజు మాణిభద్రుడనేవాడు విజయపాలుడిమీద దండెత్తటానికి పూనుకున్నాడు. మాణిభద్రుడి తండ్రి పూర్వం విజయపాలుడిచేత ఓడిపోయాడు. అందుకే అతను చిన్నతనంనుంచీ యుద్ధవిద్యలో ప్రత్యేక శిక్షణపొంది, వ్యూహ రచనలోనూ, అస్త్ర శస్త్ర ప్రయోగాలలోనూ అనేక రహస్యాలు తెలుసుకొన్నాడు. విజయపాలుణ్ణి ఓడించి, జలజను పెళ్ళాడాలని మాణిభద్రుడి ఆశయం.

మాణిభద్రుడు తన సైన్యాలతో విదర్భపైకి దండెత్తివచ్చే సమయానికి విజయపాలుడు రోగగ్రస్తుడై మంచంపట్టి ఉన్నాడు. వార్థక్యం సమీపించటంచేత రాజవైద్యులు చేసే చికిత్సకూడా అంతగా గుణమివ్వటం లేదు. ఈ జబ్బుకు తగ్గట్టే యుద్ధం వచ్చి పడటంతో విజయపాలుడి ఆరోగ్యం మరింత

కె. కళ్యాణరావు



పాడయింది. తాను స్వయంగా యుద్ధరంగంలోకివెళ్ళి ఆఖరు విజయం సాధిస్తానని రాజు లేచాడు. మంత్రులూ, వైద్యులూ మహారాజును ఈ ప్రయత్నంనుంచి మళ్ళించగలిగారేగాని ఇందువల్ల ఆయనకు మనసు మరింత కల్లోలితమయింది. రాత్రింబవళ్ళు యుద్ధవార్తలు వినేవాడు. శత్రువ్యూహాలకు ప్రతివ్యూహాలు చెప్పి మనుషులను యుద్ధరంగానికి పంపేవాడు. తన ప్రతివ్యూహాలు భగ్నమైనట్టు తెలిసి క్రుంగిపోయేవాడు.

ఈ విధంగా కొద్దిరోజులు గడిచింది. యుద్ధభూమిలో విదర్భసేనలకు అపజయం హెచ్చుతోంది. దానితోబాటు మహారాజు



వ్యాధికూడా హెచ్చుతోంది. ఇక మహారాజుకు వాస్తవ యుద్ధవార్తలు తెలపటం ప్రమాదకరమని మహామంత్రి నిశ్చయించి ఆయనతో అబద్ధాలు చెప్పసాగాడు. ఎలాగయినా మహారాజు మరో అరవై గడియలు దాటి బ్రతకడని రాజవైద్యుడు గట్టిగా చెప్పేశాడు. రెండురోజులలో మాణిభద్రుడికి సంపూర్ణ విజయం సమకూరేలాగే ఉన్నది. ఈ లోపుగా మహారాజుకు అపజయవార్త లెందుకు తెలపటం? మహారాజును అకారణంగా దేనికి ఖేదపెట్టాలి?

"మహారాజా, ఇన్నాళ్ళకు మన సేనలు శత్రుసేనల ధాటికి ఎదురునిలచి పోరాడుతున్నాయి. శత్రుసేనలలో కల్లోలం బయలుదేరింది!" అన్నాడు మహామంత్రి. అంత నీరసస్థితిలోకూడా మహారాజు చిరునవ్వు నవ్వాడు. ఒక్క నిట్టూర్పు విడిచి ఆయన కాస్సేపు కన్నుమూశాడు.

ఇంతకూ మహామంత్రి అంచనాలూ, రాజవైద్యుడి అంచనాలూ తప్పాయి. అరవైఘడియలు దాటిపోయాయి. రాజింకా జీవించేవున్నాడు. యుద్ధం మటుకు అవసానదశకు వస్తోంది.

రాజు కళ్ళుతెరిచి బలహీనంగా, యుద్ధవార్తలేమని అడిగాడు.





"మహారాజా! విజయలక్ష్మి మననే వరించనున్నది. శత్రువు ఏక్షణానఅయినా సంధికి యాచించవచ్చు," అన్నాడు మంత్రి. ముందు రాజు మరణిస్తాడా, ముందు శత్రువులు కోట ప్రవేశిస్తారా అన్నది పెద్ద ప్రశ్నఅయిపోయింది. మహారాజు మరణించిన మరుక్షణం ఏంజరిగినా మంత్రికి అంత బాధలేదు. కాని అదే జరగలేదు. అక్కడ మాణిభద్రుడు తన సేనలతో కోట ముఖద్వారం ప్రవేశించే అలికిడికి రాజు కళ్ళుతెరిచి, "మనం గెలిచామా? ఏమిటా కోలాహలం?" అని అడిగాడు.

"మహాప్రభూ! మన సేనలు విజయ ధ్వానాలు చేస్తూ రణరంగంనుండి తిరిగి వస్తున్నాయి!" అన్నాడు మంత్రి.

"నాకు ముందే తెలుసు! నాకు అపజయం లేదు," అంటూ రాజు తిరిగి కన్నుమూశాడు.

కొద్దిసేపటిలో రాజభవనాలూ, రాజాంతఃపురమూ మాణిభద్రుడు వశపరచుకుని దర్బారు ఏర్పాటుచేయించి విదర్భ మంత్రులనూ, సేనాధిపతులనూ రమ్మని అజ్ఞాపించాడు. వెళ్ళక తప్పేదిలేదు. మహామంత్రి, రాజుగారి వేలినుంచి మెల్లిగా



రాజముద్రిక తీస్తూండగా మహారాజు కళ్లు తెరిచి, "ఏమిటిది?" అని అడిగాడు.

"మహాప్రభూ, ఓడిపోయిన శత్రువులతో సంధి నెరపబోతున్నాము. సంధిపత్రంమీద రాజముద్ర వేయాలికద," అన్నాడు మంత్రి.

అకస్మాత్తుగా రాజుకు కొత్త శక్తి వచ్చినట్టయింది. ఆయన మంత్రి సహాయంతో లేచి కూచుని, "సభకు నేనే వస్తున్నాను. అన్ని ఏర్పాట్లూ చేయించు," అన్నాడు.

మహామంత్రికి మతి పోయినట్టయింది. ఏమి చెయ్యటానికీ తోచక ఆయన "చిత్తం మహాప్రభో!" అంటూ గబగబా దర్బారుకు వెళ్ళాడు. అక్కడ అప్పుడే మాణిభద్రుడు



సింహాసనం మీద అధిష్ఠించి ఉన్నాడు. సంధి పత్రం వ్రాస్తున్నారు.

"మహాప్రభూ! ఒక్క మనవి!" అని మహామంత్రి మాణిభద్రుడికి జరిగినదంతా విపులంగా విన్నవించుకున్నాడు. "మహారాజుగారు మరొక్క గడియ—తప్పితే రెండు గడియలు!—అంతకుమించి జీవించరు. వారికి నిజం తెలియకుండా కాపాడినట్లయితే నేనూ, మా విదర్భ ప్రజలూ యావజ్జీవం తమకు కృతజ్ఞులమై ఉంటాం" అని మహామంత్రి ప్రాధేయపడ్డాడు. మాణిభద్రుడు మొదట ఆగ్రహించినా, యువకుడు గనక, వినోదం చూద్దామని, చివరకు అంగీకరించాడు.

ఈసమయానికే, సేవకులు పట్టుకొని నడిపిస్తూండగా అంతఃపురంనుంచి మహారాజు వచ్చాడు. తన సింహాసనంలో కూర్చొన్నాడు. పక్కనే చేతులు కట్టుకు నిలబడిన మాణిభద్రుణ్ణి చూశాడు.

"నాయనా, మంచి యోధుడివి! చక్కని వ్యూహరచన చేశావు. మంచంలో ఉండి కూడా నేనే స్వయంగా ప్రతివ్యూహం నడపటంచేత ఓడావుగాని, లేకపోతే గెలవదగిన వాడివి. నాతో ఓడిపోవటం నీకు అగౌరవం కాదు. నీతో గౌరవనీయమైన సంధిచేస్తాను. నా కుమార్తెనిచ్చి వివాహం చేస్తాను. ఓడిపోయినా నారాజ్యం నీదే!" అన్నాడు మహారాజు నవ్వుతూ.

మాణిభద్రుడు మొదట నివ్వెరపోయినాడు. కాని సభలోకి వచ్చిన జలజను చూడగానే అతనికి ఎదురుచెప్ప బుద్ధి కాలేదు. ఇద్దరికీ మహావైభవంగా వివాహం జరిగింది.

కొద్దికాలానికి వారికొక మగశిశువుకూడా కలిగాడు. వృద్ధమహారాజు మనవణ్ణి ఎత్తుకొని ఆడిస్తూ మురిసిపోయేవాడు. చివరవరకూ ఆయన తన అపజయాన్ని గురించి ఎరగనే ఎరగడు.



# అట్టమీది బొమ్మ

అస్త్రశస్త్రాలు తీసుకురావటానికని వెళ్లిన అర్జునుడు ఎంతకాలానికీ రాకపోవటంతో ధర్మరాజు చింతాక్రాంతుడయ్యాడు. అప్పుడు బృహదశ్వుడు అనే ఋషి వచ్చి, ధర్మరాజు చింతను తొలగించటానికి ఈ కథ చెప్పాడు :—

నిషధదేశపు రాజు నలుడు. సదాచారసంపన్నుడు. విదర్భ రాజకుమారి ఐన దమయంతి అతన్ని స్వయంవరంలో వరించింది. నలుడి సదాచారసంపత్తి చూచి కలిపురుషుడికి ఈర్ష్యకలిగింది. ఒకనాడు నలుడు ఏదో చిన్న ఆచారం మరచిన సమయం చూచి, కలిపురుషుడు అతన్ని పట్టివేశాడు.

కలి ప్రోత్సాహంవల్ల నలుడు పుష్కరుడితో జూదమాడి, రాజ్యమంతా పోగొట్టుకొని, దమయంతితోసహా అడవులకు పోయాడు. అక్కడ ఆకలిబాధకు ఓర్వలేక, పిట్టలకోసం గుడ్డ పరిస్తే, అవికాస్తా ఆగుడ్డతో ఎగిరిపోయినై. ఇలా అష్టకష్టాలూ పడుతున్న నలదమయంతులు అలసి, ఒక చెట్టుకింద పడుకొన్నారు. ఈ బాధలు చూడలేని నలుడు ఆమె గాఢనిద్రలో ఉండగా, భార్య పైటచెంగు చించి కట్టుకొని, ఆమెను వదిలిపోయాడు.

నలుడు కొంతదూరం పోయేసరికి కార్చిచ్చులో చిక్కుకొని వున్న ఒక నాగుపాము 'ఓ రాజా !—నన్ను ఈ అపదనుండి కాపాడు. నీకు ఉపకారం చేస్తాను' అన్నది. నలుడు దానిని మంటలోనుంచి తీసి రక్షించాడు. కాని, అది వెంటనే అతనిని కాటువేసింది. నలుడికి కురూపం వచ్చింది.

అప్పుడు ఆ పాము 'నేను కర్కోటకుడనే సర్పరాజును. నీకిప్పుడు కలిగిన కురూపంవల్ల మేలు కలుగుతుందని ముందుముందు నీకే తెలుస్తుంది. అగత్యమైనప్పుడు నన్ను తలుచుకో. మళ్లీ నీకు మామూలు రూపం వచ్చేలాగ చేస్తాను' అని చెప్పి మాయమైంది.

తరువాత నలుడు 'సుబాహు' అనే మారుపేరుతో ఋతుపర్ణునివద్ద అశ్వపాలకుడుగా ఉంటూవచ్చాడు. దమయంతి 'చేది' రాణివద్ద చేరి, సైరంధ్రి అనే మారుపేరుతో కాలక్షేపంచేస్తూవచ్చింది. కొంతకాలానికి దమయంతి తండ్రి ఆమెకు రెండవ స్వయంవరం చాటింపించాడు. అతిచిత్రంగా, నలుడు మళ్ళీ దమయంతినే వివాహంచేసుకొన్నాడు. కలిపురుషుడు తొలగిపోయాడు. నలదమయంతులు సుఖంగా కాలంగడిపారు.




# గబ్బిలం కథ

చాలా కాలము క్రిందట
చతుష్పాత్తు లన్ని చేరి
సాటియైన పక్షులతో
సమరమునకు తలపడినవి.

గబ్బిల మొక్కటె ప్రాణభీతితో
ఎటూ చేరకను నిలచిపోయినది.

చూస్తూచూస్తూ వుండంగానే
జయజయనాదాల్ మిన్నుముట్టినవి.
జంతువులే గెలిచేటట్టున్నది
పక్షులు తప్పక ఓడిపోతవని
మెకముల పక్కకు మెల్లగ చేరి
గబ్బిల మిటు లనసాగినది :

'నేస్తాల్లారా! నేస్తాల్లారా !!
నేనూ మీవలె జంతువునేసుడి !
మీ మాదిరిగానే నాకూ
రెండువరుసలా పళ్ళున్నాయ్'

అంటూ, పళ్ళికిలించి గబ్బిలము
మృగముల పక్షం చేరింది.

ముమ్మరముగ సాగెను యుద్ధం
గరుడపక్షి చేసిన సాయం
పక్షులకే గెలుపిచ్చెను ఘనముగ
మృగముల పక్షమె ఓడిపోయినది.

జేజేల్ కొట్టెను పక్షుల బృందం
పాటలు పాడెను పిట్టల గుంపులు
గబ్బిల మప్పుడు గబగబ వచ్చి
మంతనములు సల్పెను వారితొ :

'నేస్తాల్లారా! నేస్తాల్లారా !!
మనదే తప్పక గెలుపని నేను

ఎమ్. ఎస్. శాస్త్రి

మొట్టమొదటనే అనుకొన్నాను,
సాటిలేని మన రెక్కల బలముకు
జంతువులనగా ఏపాటి ?'

నీ చుట్టరికమె మా కక్కరలే'దని
గద్దలు ముక్కుతొ పొడిచాయి
కాకులు కాళ్ళతొ తన్నాయి
గబ్బిలాన్ని తరిమేశాయి.

గబ్బిలమప్పుడు తెల్లమొగముతొ
మళ్ళీ మృగముల చేరింది.
అవికూడా దరి చేరనీయక
'పోపో పోపో, పొ'మ్మన్నయ్.

రెంటికి చెడిన గబ్బిల మంతట
రెండవ కంటికి తెలియకుండగా
ఎగిరిపోయినది ఎచ్చటికో,
మరి కనబడనేలే దెవ్వరికీ.

అందుచేతనే గబ్బిలమెప్పుడు
పగటివేళలను బయటికి రాదు,
మృగముల పక్షుల తప్పించుకు మరి
రాత్రులమాత్రమె తిరుగుచునుండు.

* * *

అవ్వా బువ్వా రెండూ రావు
ఏది కావాలో ముందే ఎంచుకొ,
ఏదో వక దేవుని నమ్ముకు
చేరుము ఏదో ఒక పక్షం.

అటు ఇటు చేరక
గబ్బిలాయిలా
అతితెలివిని చూపించబోతివా
రెంటికి చెడుదువు, జాగర్త!



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 ఆగస్టు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ జూన్ 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మజిలీ | రెండవ ఫోటో : బదిలీ

పంపినవారు : ఉండవిల్లి చిదానందం, IV F/A—M. H. స్కూలు, రాజమండ్రి

బహుమతిమొత్తం రు. 10/ ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




చాలా కాలం క్రితం తపతీనదీ తీరాన ఒక గ్రామంలో వత్సలుడనే చిన్న వర్తకుడుండే వాడు. అతడు పైకి పెద్ద ధనికుడల్లే కన బడకపోయినా, నేర్పుతో వ్యాపారంచేసి వెయ్యి బంగారు మాడలు నిలవచేశాడు.

ఇలా ఉండగా, వత్సలుడు వ్యాపారం నిమిత్తం దూరదేశం వెళ్ళవలసివచ్చింది. తనదగ్గిర ఉన్న బంగారం వెంటతీసుకు పోవటం మంచిపని కాదు. అందుచేత వత్సలుడు తన వెయ్యి బంగారు మాడ లను ఒకపెద్ద జాడీలో అమర్చి, వాటి పైభాగాన ఉసిరికాయలు కప్పి, జాడీకి మూతపెట్టి వాసిన కట్టి, ఆ జాడీని వాతాపి అనే పెద్ద వర్తకుడి ఇంటికి పట్టుకెళ్లాడు.

"అయ్యా, వాతాపిగారూ, నేను రేపు వ్యాపారంమీద వెళుతున్నాను. తిరిగి రావ టానికి మూడునాలుగు మాసాలు పట్టవచ్చు. అంతవరకూ నాయీ ఉసిరికాయలజాడీ మీ ఇంట్లో భద్రంగా ఉంచగలరా?" అని అడి గాడు వినయంగా.

వాతాపి సరేనని తన సంబారాల కొట్టులో ఒకమూల చోటు చూపాడు. వత్సలుడు స్వయంగా తనచేత్తోనే జాడీని అక్కడ పెట్టి వెళ్ళిపోయాడు.

అయితే వత్సలుడి వ్యాపారం అనుకున్న దానికన్న అధికంగా కలిసివచ్చింది. కొద్దినెలలలో తిరిగివద్దామనుకొన్న వత్స లుడు కొన్ని ఏళ్ళదాకా స్వదేశానికి తిరిగి రాలేకపోయాడు.

ఈలోగా వాతాపి, వత్సలుడి మాటే మరి చాడు. ఒకనాడతను ఇల్లు సద్దిస్తూవుండగా సంబారాల కొట్టుమూల వాసినకట్టిన జాడీ కనిపించింది. "వత్సలుడు ఏమైనట్టు? అబ్బో, ఏడేళ్ళనాడు వెళ్ళినవాడు ఇంకా బతికివుంటాడా? పాపం, ఈ జాడీ ఇక్కడే భద్రంగా దాచిపెట్టుకున్నాడు, పిచ్చివాడు.

ఎస్. కృపానిధి



అయినా ఇందులో ఏముందో చూదాం," అని వాతాపి వాసిన విప్పి, జాడీమూత తీసి, ఎండిపోయిన ఉసిరికాయలు చేతితో కదిపి చూశాడు.

పైనవున్న ఉసిరికాయలు పక్కకి తీయగానే అడుగున వున్న బంగారు మాడలు తళుక్కున మెరిశాయి. వెంటనే వాతాపి తలలోకూడా ఒక ఆలోచన తళుక్కున మెరిసింది. ఆ ఆలోచన యేమంటే— వత్సలుడు శతవిధాల చచ్చేపోయివుంటాడు; తిరిగి రాడు! అథవా వచ్చినా తనదగ్గిర బంగారం దాచినట్టు సాక్ష్యం చూపలేడు. ఆ జాడీలోవి ఉసిరికాయలనేకదా వత్సలుడు చెప్పాడు? ఉసిరికాయలజాడీ తిరిగి ఇవ్వటంవరకే తన పూచీ!

ఈ విధంగా ఆలోచన చేసినవాడై వాతాపి ఎవరూ చూడకుండా జాడీలోని వెయ్యి బంగారుమాడలూ తీసి వేరే దాచేశాడు. ఎందుకైనా మంచిదని జాడీనిండా ఉసిరికాయలు తెచ్చిపోసి, మూతపెట్టి, జాడీ యథాస్థానంలో పెట్టేశాడు.

ఇది జరిగిన కొద్దిరోజులకే వత్సలుడు వచ్చాడు. వాతాపిదగ్గిరికి వెళ్ళి తన జాడీ తీసుకుని ఇంటికి పోయి చూసుకున్నాడు. ఎంత తీసినా జాడీనిండా ఉసిరికాయలే తప్ప బంగారం జాడ ఏమీలేదు. వత్సలుడికి కడుపు మండిపోయింది. అతను వాతాపి దగ్గిరికి వెళ్ళి "నువ్వేమో పెద్దమనిషివనుకున్నాను! నా బంగారం కాస్తా కాజేస్తావా?" అని అడిగాడు.

"నీ దిక్కుమాలిన జాడీ నాదగ్గిర ఏడేళ్లపాటు ఉంచినది నామీద దొంగతనం అంటగట్టడానికేనా? నీ జాడీని నువ్వే తెచ్చిపెట్టావు, నువ్వే మళ్లీ తీసుకుపోయావు. ఉసిరికాయల జాడీలో బంగారం ఉంచటమేమిటి? నాకాసంగతి అప్పుడు చెప్పావా? ఇప్పుడు కల్పిస్తున్నావుగాని!" అన్నాడు వాతాపి కోపం నటిస్తూ.

వ్యవహారం న్యాయాధికారి వద్దకు వెళ్లింది. న్యాయాధికారి వాదిప్రతివాదులకు కబురుపెట్టాడు. వత్సలుడూ వాతాపి హాజరయారు. ఈ విచిత్రమైన నేర విచారణ చూడటానికి ఊరివారంతా వచ్చారు.

ఏడేళ్ళక్రితం తాను జాడీలో వెయ్యి బంగారుమాడలు దాచి, వాటిపైన ఉసిరి కాయలు కప్పి వాతాపి ఇంట్లో దాచి వెళ్ళాననీ, తిరిగి ఈ ఉదయమే తానువచ్చి జాడీ చూస్తే బంగారం మాయమైపోయి జాడీ నిండా ఉసిరికాయలున్నాయనీ, వెయ్యి బంగారు మాడలనూ వాతాపి తనపొట్టన పెట్టుకున్నాడనీ వత్సలుడు, న్యాయాధికారికి విన్నవించుకొన్నాడు.

తాను ఆ జాడీని ముట్టుకొనైనా లేదనీ, దాన్ని వత్సలుడే స్వయంగా తనయింట పెట్టి మళ్ళీ ఏడేళ్లకు వచ్చి స్వయంగా తానే తీసుకుపోయాడనీ, తనదగ్గిర ఉన్న సొత్తు కాజెయ్యాలనే దురుద్దేశంతో యిప్పుడు వత్సలుడీ కల్పన చేస్తున్నాడని వాతాపి మనవి చేసుకొన్నాడు.

"ఏమయ్యా, నీ జాడీలో బంగారం పెట్టినట్టు చెప్పటానికి ఏమైనా సాక్ష్యం వుందా?" అని వత్సలుణ్ణి న్యాయాధికారి అడిగాడు. "చిత్తం, నా అంతరాత్మా, వాతాపి



అంతరాత్మా తప్ప ఇంకేమీ సాక్ష్యంలేదు," అన్నాడు వత్సలుడు.

"అలాటప్పుడు నీ మాట నమ్మటం సాధ్యంకాదు. అయినా నీ జాడీ సరిగా చూసుకున్నావా? బంగారం ఏమైనా పెడితే అందులోనే ఉందేమో," అన్నాడు న్యాయాధికారి.

"చూశానండీ, ఉసిరికాయలు తప్ప అందులో ఏమీలేదు" అన్నాడు వత్సలుడు, వెలవెలపోతూ.

"ఏదీ? జాడీ పట్టుకొరా, నలుగురి ఎదటా సందేహనివృత్తి చేసుకుందాం," అన్నాడు న్యాయాధికారి.



తనకు న్యాయం జరుగుతుందన్న నమ్మకం వత్సలుడికి పోయింది. అయినా న్యాయాధికారి కోరినట్టు ఇంటికిపోయి ఉసిరికాయలతోసహా జాడీ తెచ్చి న్యాయ స్థానంలో వుంచివాటిని బయటికి తోడుతూ, "చూడండి. ఒక్క బంగారుమాడకూడా లేదు. అన్నీ కాజేశాడు. మీరే చిత్తగించండి," అన్నాడు వత్సలుడు ఆవేదనతో.

అయితే న్యాయాధికారి వత్సలుడి మాటలు వినటంలేదు. ఆయన రెండు మూడు ఉసిరికాయలు తీసుకుని, ఒక్కొక్కటే కొరికిచూస్తూ, "ఆశ్చర్యం! ఆశ్చర్యం!" అనసాగాడు. అందరూ ఆయనకేసి వింతగా చూస్తున్నారు.

"మీరంతా తలా ఒక కాయా తీసుకుని రుచిచూడండి!" అన్నాడు న్యాయాధికారి.

ఎందుకో తెలియకుండానే అందరూ తలా ఒక కాయా తీసుకుని రుచిచూశారు. న్యాయాధికారి వత్సలుడికేసి తిరిగి, "ఏడేళ్ళక్రితం నువు జాడీలో పెట్టిన కాయలు నిన్న కోసినట్టుగా ఎంత రుచిగా ఉన్నాయో! ఎక్కడ సంపాదించావయ్యా ఈ అపురూపపు ఉసిరికాయలు?" అన్నాడు.

వత్సలుడు వెర్రిమొహం వేశాడు. మిగిలినవారుమటుకు, "అయ్యా, ఇవి ఏడేళ్ళ క్రితం కోసినవికావు. ఈయేడు కోసినవే," అన్నారు న్యాయాధికారితో.

న్యాయాధికారి వాతాపికేసి తిరిగి, "ఏమయ్యా? నువు ఈ జాడీ ముట్టుకోనైనా లేదంటివే? ఇందులోకి ఈయేడు కోసిన ఉసిరికాయ లెలావచ్చాయి? ప్రమాణంచేసి అబద్ధం చెప్పినందుకు ఉరిశిక్ష విధించి తలారికి వప్పగించనా? మర్యాదగా బంగారం వత్సలుడికి ఇచ్చేస్తావా?" అని అడిగాడు.

వెంటనే తాను చేసిన తప్పు ఒప్పుకుని వాతాపి వత్సలుడికి వెయ్యి బంగారు మాడలూ ఇచ్చేశాడు. న్యాయాధిపతి యుక్తిని అందరూ మెచ్చుకున్నారు.



## మే నెల 'చిత్రకథ'

ఒకనాడు అల్లరిరంగడు ఆలోచిస్తూ కిటికీలోంచి చూస్తూండగా, ఒక తాత "బుడగలండోయ్ బుడగలు!" అని అరుస్తూ, రంగురంగుల రబ్బరుబుడగలను దారాలకు కట్టి ఎగురవేస్తూ అక్కడికి వచ్చాడు. అది మిట్టమధ్యాహ్నపు వేళేమో అలిసిపోయిన తాత ఆ కిటికీ పక్కన గోడకానుకుని క్షణంపాటు నుంచుందాం అనుకున్నాడు.

ఇంకేం, కిటికీలోంచి తొంగిచూస్తున్న రంగడు బలే సంబరపడాడు. చెంగున పోయి బల్లమీదవున్న కత్తెర తీసుకువచ్చి బుడగలకు కట్టివున్న దారాలను ఒకటొకటే కత్తిరించివేశాడు.

పాపం, అలిసిపోయి గోడకానుకు నిలబడివున్న తాతకు రంగడి చిలిపిపని ఛప్పున తెలిసిందికాదు. కాసేపటి కల్లా తేరుకుని తాత "బుడగలండోయ్ బుడగలు!" అంటూ అక్కణ్ణించి బయలుదేరాడు. రెండడుగులు వేసి బుడగలు గాలికి రెపరెపమనడంలేదేమా అని చేతికేసి చూసుకున్నాడు.

తాతచేతిలో తెగిపోయిన దారాలు వున్నాయి. బుడగలు గాలిలో పల్లటీలు కొడుతూ ఎగిరిపోతున్నాయి. రంగడు కిటికీదగ్గిర్నుంచి మాయమయాడు.

## కితకితలు

"నిన్న బడికి ఎందుకని రాలేదు?" అని ప్రశ్నించాడు టీచరు, అప్పుడే వచ్చిన గోపీని.

"జబ్బుచేసింది సార్!" అంటూ గోపీ తల పక్కకు తిప్పుకుని జవాబిచ్చాడు.

"ఆ మాట సూటిగా చెప్పక, తల పక్కకు తిప్పుకుంటావేం?" అన్నాడు టీచరు.

"మొహం ఎదట అబద్ధాలు చెప్పకూడదని మీరు లోగడ చెప్పారుగదా సార్?" అన్నాడు గోపీ.

* * *

"'ఆదాయపు పన్ను' అంటే ఏమిటో తెలుసా?" అని ప్రశ్నించాడు టీచరు.

"తెలుసు సార్! బాగా డబ్బున్నవాళ్ళు ప్రభుత్వానికి చెల్లించేది!" అన్నాడు ఒక విద్యార్థి.

"అయితే ఎక్కువ ఆదాయపు పన్ను చెల్లించేదెవరో చెప్ప?" అన్నాడు టీచరు.

"కుబేరుడు సార్!" అని వెంటనే జవాబిచ్చాడు విద్యార్థి.

* * *

భక్తుడి కథ వినిపించి "పుణ్యం చేసినవాళ్ళు ఎక్కడికి పోతార్రా రామూ?" అని అడిగాడు మేష్టరు.

"స్వర్గానికి సార్!" అని రామూ జవాబు.

"పాపం చేసినవాళ్ళో?"

"నరకానికి సార్" అన్నాడు రామూ.

అప్పుడు మేష్టరు నవ్వుతూ "ఈ రెండూ చేయనివాళ్ళు ఎక్కడికి వెళ్తారో చెప్పగలవురా?" అని అడిగాడు.

"వాళ్ళు ఎక్కడికీ వెళ్ళరు సార్! ఇక్కడే హాయిగా వుంటారు!" అన్నాడు రామూ తొణక్కుండా.

# రత్నగోళం (అట్టచివరి బొమ్మ) - 2

చీనాచక్రవర్తి చూపించే వింతలు హిట్సూకు స్వర్గానందమే కలిగించినై. కాని,— ఆమె ఇంటిదగ్గర తన దేవికి చేసివచ్చిన వాగ్దానం మనస్సులో మెదులుతూనే వున్నది. చివరకు ఒకనాడు, ఆమె తన కోరికను భర్తకు వెల్లడించింది. ఇందుకు చక్రవర్తి చాలా సంతోషించాడు. ఏమంటే, ఆమె కోరిక నెరవేరటమే ఆయనకు ముఖ్యంగా కావలసింది.

కనుక, అమూల్యమైనవీ అపురూపమైనవీ కానుకలు ఎవరివద్ద ఉన్నా సరే, తమ ఆస్థానానికి పట్టుకరమ్మని దేశదేశాలలో చాటింపువేయించాడు. ఇది విని ఎందరెందరో వర్తకులు అద్భుతమైనవీ అందమైనవీ వస్తువులు తీసుక వచ్చి చక్రవర్తిముందు పెట్టారు.

చక్రవర్తిపక్కనే హిట్సూ కూర్చున్నది. ఆ వింతవస్తువులన్నీ ఒకటొకటే పరిశీలించింది. ఒక్కటీ ఆమెకు నచ్చలేదు. చివరకు అమె చూచినవాటిలో— కటికచీకటినైనా పటాపంచలుచేసి పట్టపగలు చేయగల రత్నగోళం ఒకటున్నది. ఇది ఒక్కటి హిట్సూను ఎంతగానో ఆకర్షించింది. దీనినే ఆమె తన దేవికి కానుకగా పంపటానికి నిశ్చయించుకున్నది.

హిట్సూ ఆ రత్నగోళాన్ని ఒక బంగారుబరిణెలో జాగ్రత్తగా పెట్టి, నమ్మకస్థుడైన ఒక ఓడ కప్తానుచేతికి తనే ఇచ్చి 'ఓయి కప్తానూ!—దీనిని నీ ప్రాణ సమానంగా చూచుకోవాలిసుమా! భద్రంగా తీసుకుపోయి మా ఊరిలో దేవి ఆలయంలో వుండే పూజారికి నేనిచ్చినట్టు ఇచ్చిరా!' అని చెప్పి పంపింది. ఆ కప్తానుకు కొంతమంది సైనికులు తోడువెళ్ళగా, ఓడ చైనానుండి జపాను దేశానికి బయలుదేరింది.

గాలి అనుకూలంగా ఉండటంచేత, మొదట కొంతవరకూ ఓడ బాగానే సాగిపోయింది. తను గొప్ప బహుమతి పొందవచ్చుకదా అని కప్తానూ సంతోషించాడు. తీరా ఇక కొద్దిలో ఓడ ఒడ్డు చేరుకొంటుందనగా పెద్ద తుఫాను పట్టింది. అది అంతకంతకు ఎక్కువై సముద్రం అల్లకల్లోలం కాసాగింది. కప్తానుకు ఏమీ తోచలేదు. ధైర్యం బొత్తిగా సడలిపోయింది. అయితే—



# పరంతపుడు

పూర్వకాలమందు దేవలోకంలో 'పరంతపుడు' అనే గంధర్వుడు ఉండేవాడు. అతను చాలా పొట్టివాడు, కురుచకాళ్లు. అందుచేత గబగబ నడవలేకపోయేవాడు. ఐతే, వాని బుద్ధిబలంమట్టుకు గొప్పది. యంత్రాలు నిర్మించటంలో అతనిని మించినవాళ్ళు ఏ లోకంలోనూ లేరు.

పరంతపుడు తన చాతుర్యంవల్ల ఒక చక్కటి చిన్నారి విమానం సృష్టించుకొన్నాడు. ఎక్కడికి పోవాలన్నా అతను విమానం ఎక్కి వెళ్ళేవాడు. దీనివల్ల వానికి నడవవలసిన బాధ తప్పిపోయింది.

ఒకరోజున పరంతపునికి భూలోక సంచారం చేసివద్దామని బుద్ధిపుట్టింది. తన విమానంమీద బయల్దేరాడు. చాలాదూరం పోగాపోగా, ఒక మైదానం తగిలింది. అక్కడ అకస్మాత్తుగా విమానం బుర్ర్ర్ మని ధ్వనిచేసికొంటూ, గిరగిర తిరిగి ఒక ఇంటిపైన పడింది. చూడగా, ఆ ఇల్లు ఎలకయ్యగారిది!

విమానం పడటంతోనే ఆ ఇల్లు వూగిసలాడింది. ఎలకయ్య కోపంతో చప్పట్లు కొడుతూ 'తియ్యవయ్యా పెద్దమనిషీ, నీ విమానం నువ్వూనూ! నా కొంప కూల్చివేశావు!' అన్నాడు.

పరంతపుడు, ఇంటిమీద పడిన తన విమానంమీదినించే, 'అయ్యో, ఎలకయ్యా ఎంతపని జరిగిందీ! నాకు నీకంటె ఎక్కువ విచారంగా వుంది. ఉండు నా విమానం ఎందుకు కూలిపోయిందో చూస్తానుండు' అని విమానం నలుమూలలా పరీక్షించాడు.

చివరకు ఒక్కసారి చిరునవ్వు నవ్వి 'ఓస్, ఏమిటో అనుకొన్నాను ఎలకయ్యా! దీనిలో అసలు, జీవరసం పోయనేలేదు. నేనీవాళ ఎందుకని మరచిపోయానో నాకే తెలియటంలేదు ఎలకయ్యా' అన్నాడు.

పి. సుభద్ర





తప్పిపోయింది...' అన్నాడు పరంతపుడు. దానికి ఎలకయ్యా ఏమీ మాట్లాడలేదు. అయితే మరి ఇప్పుడు ఏమి చేయటమా అని పరంతపుడు బుర్ర గోక్కొని ఆలోచించాడు. ఎలకయ్యా బుర్ర గోక్కొని ఆలోచించాడు. చివరకు ఎలకయ్యా అన్నాడుకదా, 'దేవయ్యా దేవయ్యా!— నువు నా వీపుమీద ఎక్కి కూర్చో, నీకంటె నేను బలమైనవాణ్ణి, వడిగా పరుగెత్తనూ గలను. రా పోదాం, వింధ్యారణ్యాలలో కొండలమీదికి' అన్నాడు.

'ఏమిటా జీవరసం దేవయ్యా? అది లేకపోతే విమానం ఎగరదా?' అని అడిగాడు ఎలకయ్యా ఆత్రంతో.

'కదలనే కదలదు! ఇప్పుడదే వచ్చిన చిక్కు. ఈ జీవరసం మా దేవలోకంలోనే కాని దొరకదు. యిక్కడ ఆ చెట్లు ఒక్క వింధ్యారణ్యాలలోని కొండలమీద మాత్రం ఉన్నాయని విన్నాను. వాటి ఫలాలనుండి రసంతీసి పోస్తే నా విమానం మళ్ళీ నడుస్తుంది. లేకుంటే లేదు. నేను అక్కడికి పోయివద్దామంటే, నా పొట్టికాళ్ళతో గబగబ నడవలేను. అదీకాక, ఈ విమానం తయారైనప్పటినుంచీ నాకు నడక అలవాటే

జీవరసం నింపుకోవటానికని ఒక ఖాళీ పాత్ర చేతపుచ్చుకొని, పరంతపుడు ఎలకయ్యా వీపుమీద ఎక్కాడు. వాళ్లు బయలుదేరారు. చెట్లూ గట్లూ పుట్టలూ గుట్టలూ పొలాలూ మైదానాలు దాటుకొని కొన్ని యోజనాలు ప్రయాణం చేశారు. ఒక చోటికి వచ్చేసరికి, ఒక నది అడ్డం వచ్చింది. అప్పుడు ఎలకయ్యా ముఖం విచారంగా పెట్టి, 'అయ్యో దేవయ్యా!—ఏంచేసేది, నాకు ఈత రాదే!—ఈ నది దాటటం ఎలాగ?' అని అన్నాడు.

అప్పుడు పరంతపుడు ఎలకయ్యా వీపు మీదినించి కిందికి దిగాడు. బుర్ర గోక్కొని నదివేపు చూశాడు. అటు చూశాడు, ఇటు





చూశాడు. చివరకు చిరునవ్వుతో 'భయ పడకు ఎలకయ్యా!—ఈత చేతకాక పోతేనేం? అదిగో—ఆ కనపడే దుంగ ఊతగా తీసుకుని మనం నది దాటవచ్చు' అన్నాడు. పరంతపుడు దుంగ తెచ్చాడు. ఎలకయ్య ఎక్కాడు. ఇద్దరూ కలిసి నది అవతలి ఒడ్డు చేరుకున్నారు. తిరిగి వచ్చేటప్పుడు మళ్ళీ కావాలికదా! అందుకని ఇద్దరూ కష్టపడి ఆ దుంగపట్టుకు గట్టుకు లాగారు.

ఆ తరువాత మళ్ళీ పరంతపుడు ఎలుకయ్య వీపుమీదికి ఎక్కి కూర్చున్నాడు. ఇద్దరూ మళ్ళీ ప్రయాణం సాగించారు. చెట్లూ, గట్లూ, పుట్టలూ గుట్టలూ, పొలాలూ మైదానాలూ ఎన్నెన్నో దాటారు. కొంతసేపు అయినతరువాత ఎలకయ్య పరుగు మాని వేసి, నెమ్మదిగా నడవసాగాడు. మరి కొంచెం సేపటికి ఆగిపోయి, 'నేనింక నడవ లేను దేవయ్యా! చూడబోతే అన్నీ ముళ్ళూ, కంపలున్నూ. నడిస్తే కాళ్ళు పుండ్లయి పోతయి. రా, వెనక్కి పోదాం" అన్నాడు.

పరంతపుడు గభీమని ఎలకయ్య వీపు మీదినించి కిందకు దూకాడు. ఒక్కసారి కళ్ళు చికిలించాడు. 'ఎలకయ్యా! దీనికే భయమా? నువు నా జోళ్లు తొడుక్కో. ముళ్ళు గుచ్చుకోవు' అంటూ, తన కాలి




జోళ్ళు తీసి ఎలకయ్య వెనకకాళ్ళకు కట్టి, గట్టిగా తాళ్ళతో బిగించాడు. ఇందుకు ఎలకయ్య చిరునవ్వు నవ్వాడు. ఈసారి ఎంతో ఉత్సాహంతో ఎలకయ్య మళ్లీ పరంతపుడిని వీపుమీద ఎక్కించుకొని, ప్రయాణం సాగించాడు.

యిద్దరూ వెళ్ళి వెళ్ళి ఒక అరణ్యం చేరుకొన్నారు. 'ఎలకయ్యా—ఇక్కడ ఆగు. వింధ్యారణ్యాలకు వచ్చేశాం' అన్నాడు పరంతపుడు. "నువ్వు విశ్రాంతి తీసుకో, నేను కొండమీదికి పోయి, ఈ పాత్రలో జీవరసం నింపుకొని వస్తాను. మనం ఇంటికి వెళ్ళిపోవచ్చు" అన్నాడు.



'సరే' అన్నాడు ఎలకయ్య. బడలికచేత ఎలకయ్యకు చిటికలో నిద్రపట్టేసింది. పరంతపుడు కొండమీదికి వెళ్ళాడు. పాత్ర నిండా జీవరసం నింపుకొన్నాడు. తిరిగి అరణ్యంలోకి వచ్చి, ఎలకయ్యను లేపాడు.

కళ్లు నులుముకొంటూ, ఆవలిస్తూ లేచాడు ఎలకయ్య. రెండు మూడు సారులు కళ్ళు చిగిలించాడు. చిరునవ్వు నవ్వుతూ 'దేవయ్యా, మరి వెళదాం. పాత్ర జాగర్త సుమా!' అని హెచ్చరించాడు.

జీవరసం నింపిన పాత్రను పరంతపుడు గట్టిగా చేత పట్టుకొన్నాడు. బయలుదేరారు ఇద్దరూ. చెట్లూ గట్లూ, పుట్టలూ గుట్టలూ, పొలాలు, మైదానాలు, ముళ్లూ కంపలూ ఇవన్నీ దాటుకొని చివరకు ఎలా అయితేనేం, ఇద్దరూ కలిసి ఎలకయ్య ఇంటికి క్షేమంగా చేరుకొన్నారు.

చేరుకొనేసరికి ఎలకయ్య ఇంటి మీద పరంతపుడి విమానం ఎప్పటిలాగే వున్నది. పరంతపుడు ఇంటిపైకి ఎక్కాడు. విమానం పొట్టనిండా జీవరసం నింపాడు. మళ్లీ ఒకసారి విమానం బుర్ర్ర్ మంటూ ధ్వని ప్రారంభించింది. పరంతపుడు విమానం ఎక్కి కూర్చున్నాడు. 'ఎలకయ్యా'- మరి నే పోయివస్తా' అన్నాడు. ఎలకయ్య కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

ఎలకయ్య విచారాన్ని పరంతపుడు చూడలేకపోయాడు. 'ఎలకయ్యా, ఎలకయ్యా!—నీకెందుకు వచ్చిన విచారం. నీ కొంప ఎలాగూ కూలేపోయేట్టుందికదా. నాతో వచ్చేసెయ్యి. ఉఁ—ఎక్కు విమానం!' అన్నాడు.

వెంటనే ఎలకయ్యకు కంటితడి ఆరిపోయింది. చిరునవ్వు నవ్వుతూ విమానంలోకి ఒక్క దూకుదూకి 'దేవయ్యా' అంటూ పక్కనే కూర్చున్నాడు. పరంతపుడినీ ఎలకయ్యనూ కూడా ఆ విమానం గంధర్వ లోకంలోకి తీసుకపోయింది!



# చిత్రకథ



దాసు, వాసు అట్లా ఊరిబయటికి షికారువెళ్ళారు. ఒకచోట పచ్చికమీద కూర్చున్నారు. వాసు పెంపుడుకుక్క 'టైగర్' వాళ్లు వెంట తెచ్చిన గొడుగు నోటితో పట్టుకొని ఆడుకుంటోంది.

అల్లంత దూరాన మేస్తున్న గొర్రెపొటేలు వీళ్ళని చూసింది. 'ఈ కుర్రవాళ్ళేమిటి, భయంభక్తి లేకుండా యీ చాయలకు రావటం ఏమిటి?' అనుకున్నది. మరుక్షణంలోనే తల వంచి, "చూడండి 'ఢీ' కొట్టి తరిమేస్తాను" అనుకుంటూ వాళ్ళమీదికి దూకింది.

దాసు, వాసు పొటేల్ని చూశారు. తమదగ్గిరవున్న పులిబొమ్మ గొడుగును తెరిచి, తమ మీదికి పరుగెత్తి వస్తున్న పొటేలుకు ఎదురుగ్గా పెట్టారు. ఇక పులి రానే వచ్చిందని పొటేలు హడలుకొని అక్కణ్ణించి ఉడాయించింది.




Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd, Madras-26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by P. K. Patel




బహుమతి
పొందిన వ్యాఖ్య

బదిలీ

పంపినవారు :
వి. చిదానందం - రాజమండ్రి

